# రేపటి విజేతలందరికీ శుభాకాంక్షలతో...

ఏ విజయాన్నైనా చాలా మంది కలిసికట్టుగా ప్రయత్నించినప్పుడే సాధించడం వీలవుతుంది. నేను కూడా ఐ.ఏ.ఎస్. సాధించడానికి మా అమ్మ నాన్నలు ( శ్రీమతి ఆకురాతి భోగేశ్వరి, డా॥ ఆకురాతి కోదండరామయ్య ) ఎంతగానో తోడ్పడ్డారు వారి కృషితో నా కృషిని కలుపుకుని ఈ విజయం సాధించాను. - **ఆకురాతి పల్లవి**

గత 8 సంవత్సరాల నుంచి ఎనలేని కృషితో పట్టుదలతో శ్రమించి ఇంగ్లీష్‌లో ఉన్న ఎన్నో పుస్తకాలను చదివి తనదైన శైలిలో తెలుగులోకి తర్జుమా చేసి తెలుగులోనే సివిల్స్ వ్రాసి విజయకేతనం ఎగురవేసిన **ఆకురాతి పల్లవి** ఎంతో కష్టపడి తయారు చేసి సంపాదించిన జ్ఞానాన్ని ఆమె వరకే పరిమితం కాకుండా మెటీరియల్ ద్వారా అందరికీ అందుబాటులోకి తెచ్చినందుకు వారికి కృతజ్ఞతలు.

అనువాదం చేసేటప్పుడు చాలా సమస్యలు ఎదురవుతాయి. ఎందుకంటే ఒక భాషా నిర్మాణం మరో భాషా నిర్మాణంతో పూర్తిగా సరిపోదు. అటువంటి ఎన్నో సమస్యలను ఎదుర్కొని ఇంగ్లీషు నుండి తెలుగులోకి అతి సులభ పద్ధతిలో తర్జుమా చేసి ఆ మెటీరియల్‌ను తెలుగు మీడియం విద్యార్థులకు అందుబాటులోకి తేవాలనే నా కోరికను మన్నించినందుకు నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనాలు.

ప్రతి మనిషిలో అనంతమైన శక్తి దాగి ఉంటుంది. దానిని వినియోగంలోకి తెచ్చుకోవడంలోనే మనిషి విజయం ఆధారపడి ఉంటుంది. ఆ శక్తిని ఎవరైతే పూర్తిగా సద్వినియోగం చేసుకోగలుగుతారో వారే ఆకాశమే హద్దుగా విజయాలవైపు అడుగులు వేయగల్గుతారు.

అసహనంతో జరిగే ప్రయోజనమేమీ లేదు. ఓర్పువహించండి. విజయం మిమ్మల్ని తప్పక వరిస్తుంది. కావున మీ లక్ష్యానికి తగ్గట్టుగా పట్టుదలతో నిరంతరం శ్రమించండి. విజయం మీదే !

**మంచి స్నేహితునిలా ఈ మెటీరియల్ ఎందరి మనసుల్నో తట్టి లేపి విజయపథం వైపు నడిపిస్తుందని ఆశిస్తున్నాను.**

**గమనిక:** గత 8 సంవత్సరాల నుండి ఎంతో శ్రమ పడి తయారుచేసుకోబడ్డ ఈ మెటీరియల్‌ను అందరికీ అందుబాటులోకి తేవాలనే సంకల్పంతో ఉచితంగా ఈ మెటీరియల్‌ను **శ్రీనివాస జిరాక్స్ సెంటర్‌**లో ఇవ్వడం జరిగింది. కేవలం జిరాక్స్‌కైన మొత్తమునే చెల్లించి ఈ మెటీరియల్ పొందవచ్చు.

మీ ఉన్నతిని ఆశిస్తూ....

ఎ. మధుసూదన్ రెడ్డి, Civil Aspirant

## Books that I referred to prepare this material

# MEDIEVAL INDIA

1. Satish Chandra 2 volumes***
2. Mehta 3 volumes
3. NCERT
4. IGNOU***
5. Brilliant
6. Gopala Reddy
7. Ambedkar Open University
8. P.G. Guides
9. Publications Division (Majumdar & Others)
10. Krishna Reddy
11. Hanumantha Rao
12. V. D. Mahajan***
13. Sri Vathsava

# పల్లవి. విషయావళి

# Chapter - 20

## Evolution of religious and social outlook.

అక్బరు నిరపేక్షంగా ఉదారమైన పరిసరాలలో పుట్టి పెరిగాడు. అతని తండ్రి[1] మొఘలు సున్నీ, తల్లి[2] పర్షియన్ షియా. అతను పుట్టింది[3] హిందూ రాజు రాణా వీర్సల కోటలో. అతని సంరక్షకుడు[4] ~~గురువు~~ బైరాంఖాన్ సంప్రదాయ షియా. అక్బరు చదువు గురువు[5] అబ్దుల్ లతీఫ్ షియా దేశమైన పర్షియాలో సున్నీగా, సున్నీ దేశమైన ఉత్తర భారతంలో షియా గానూ ముద్రింపబడ్డాడు. లతీఫ్ బోధించిన "సుల్హ్-ఇ-కుల్" (విశ్వశాంతి) సూత్రాన్ని అక్బరు ఎప్పటికీ మర్చిపోలేదు.

చెంఘిజ్ ఖాన్, తైమూరుల పరమత సహన విధానం (eclectic policy) తాతల బాబరు, హుమాయూన్ల విధానాల్లోనూ ప్రతిఫలించింది. ఈ టర్కీ-మొఘల్[6] సంప్రదాయాల ప్రభావం అక్బరుపై ప్రభావం చూపిందని చరిత్రకారుడు సతీష్ చంద్ర అభిప్రాయపడ్డారు. పైగా అక్బరు నాటి కాలంలో హిందూముస్లింల ఐక్యతని ప్రవచించే ఉద్యమం భక్తి ఉద్యమకారులు,[7] ఉదార సూఫీ గురువుల ఆధ్వర్యంలో కొనసాగుతోంది. ఈ బయటి ప్రభావాలే గాక స్వతహాగా అక్బరు ఎంత లోతైన ఉత్సుకతతో నిండిన మేధస్సు, సూఫీతత్వం[2] పట్ల అతని ఆసక్తి కూడా అక్బరు మత దృక్పథాన్ని మలచడంలో కీలక పాత్ర పోషించాయి.

క్రీ.శ. 15 వ శతాబ్దం లో హిందూ ముస్లింలు దగ్గరికి రావడమన్నది మేధా మరియు ఆధ్యాత్మిక రంగాల లో పాటు రాజకీయ రంగాన్ని కూడా ప్రభావితం చేసింది. కబీరు, నానక్ వంటి భక్తి ఉద్యమకారులు, చిష్టి, సుహ్రవర్దీల వంటి సూఫీ గురువులు వారి శిష్యులని గాని ప్రజలని గాని 'మతం' ఆధారంగా వేరు చేసి చూడలేదు.

రాజకీయంగా గుజరాత్, మాల్వా, కాశ్మీరు వంటి ప్రావిన్షియల్ రాజ్యాల్లో హిందువుల్ని స్థానిక స్థాయిల్లోనే గాక కేంద్ర ప్రభుత్వం లో కూడా నియమించడం మొదలైంది. హిందూ రాజులకి అమీరుల హోదా కూడా ఇవ్వడం మొదలైంది.

అక్బరు స్వతహాగా మార్మికుడు[3]. అతను తన మార్మికత కారణంగానే ఏకాంతాన్ని కోరుకుని ఆ ఏకాంతం లో భగవంతుడు అతని సృష్టికి సంబంధించిన ప్రశ్నల్ని గురించి ఆలోచించేవాడు. అజ్మీరు తదితర ప్రాంతాల్లో గల సూఫీ గురువుల సమాధుల్ని భక్తి శ్రద్ధలతో సందర్శించేవాడు.

మత సహన విధానం లో అక్బరు పై షేర్షా ప్రభావం కూడా ఉందని కొందరు చరిత్రకారులు అన్నారు. ఏదేమైనా మధ్యయుగ చక్రవర్తుల్లో పరమత సహనాన్ని తాత్వికత్వం స్థాయికి తీసుకెళ్లిన వానిగా అక్బరు విలక్షణమైనవాడు.

## తొలి దశ (క్రీ.శ. 1556-73)

ఇరవై ఏళ్లు కూడా నిండక మునుపే అక్బరు యుద్ధ ఖైదీల్ని బానిసల్ని చేసి ఇస్లాం లోనికి మార్చే దురాచారాన్ని నిషేధించాడు. అంతలోనే కలిగిన ఆధ్యాత్మిక చైతన్యం వల్ల క్రీ.శ. 1563 లో హిందువుల పై ఉన్న యాత్రా పన్ను[2] ను రద్దు చేశాడు. క్రీ.శ. 1564 లో (ఇంతకు ముందున్న టర్కీ-ఆఫ్ఘన్ సుల్తానులందరూ చివరికి బాబరు, హుమాయూన్లు కూడా జిజియా వసూలు చేయడం తమ మతపరమైన విధి గా భావించారు.) అక్బరు జిజియా[3] - ముస్లిమేతరుల పై విధించబడే పన్ను ను రద్దు చేసి విప్లవాత్మకమైన మార్పు తెచ్చాడు. అయితే అక్బరు ఈ దశ లో తన వ్యక్తిగత జీవితం లో మాత్రం సనాతనం నిండిన వాడే అయినా సనాతన[4] ఉత్సాహ ముస్లిం గా ఉన్నాడు.

ఈ దశ లో అక్బరు తిరుగుబాటు[5] చేసిన గ్రామాల వారి భార్యల్ని, పిల్లల్ని బానిసల్ని చేసే విధానాన్ని స్పష్టం చెప్పాడు. రాజపుత్ర[6] రాకుమార్తెల్ని మొదట ఇస్లాం కు మత మార్పిడి చేయించకుండానే వారిని వివాహం చేసుకున్నాడు, అంతేగాక రాజభవనాల్లో వారు వారి[7] మతాన్ని అవలంబించుకునేందుకు పూర్తి స్వేఛ్ఛ నిచ్చాడు.

అక్బరు ఈ చర్యల వెనుక దేశం లో అధిక సంఖ్యాకులైన హిందువుల మనసు గెలుచుకోవాల్సిన అవసరాన్ని గుర్తించినట్లు గా తెలుస్తుంది.

ఈ దశ లో అక్బరు విశాలమైన, ఉదారమైన

మత విధానాన్ని అవలంబించిన ఈ కాలం లో ఆస్థానం లో సనాతన ఉలేమాలు అధికారాన్ని చెలాయించ గలిగారు. ఉదాహరణకు అబ్దున్నబి తన ఇష్టాలకు రెవెన్యూ చెల్లించనవసరం లేకుండా ఉండే భూముల్ని దానం చేసేందుకు స్వేచ్ఛ కలిగి ఉండేవాడు. అబ్దున్నబి తన వాదాన్ని ఉపయోగించి తన వ్యతిరేకుల్ని సున్నీ వ్యతిరేక చర్యలకి పాల్పడ్డారన్న నెపం తో మరణశిక్షలకి కూడా గురిచేశాడు.

## రెండవ దశ ( క్రీ.శ. 1573 - 80 )

ఈ దశ లో తీవ్రంగా జరిగిన చర్చలు, ఆత్మ విమర్శ అక్బరు మత దృక్పథం లో పెను మార్పుల్ని కలిగించాయి, చివరి దశ (క్రీ.శ. 1581 - 1605) లోని రాజ్య రాజకీయాల పై తమ లోతైన ప్రభావాన్ని చూపాయి.

తన మత సూత్రాల్ని స్పష్టంగా తెల్సుకోవాలనే కోరిక లో అక్బరు క్రీ.శ. 1575 లో "ఇబాదత్ ఖానా" ( ప్రార్థనా మందిరం) ను నిర్మించాడు. మొదట్లో ఇబాదత్ ఖానా చర్చలు ముస్లింలకే పరిమితమయ్యాయి. అయితే వివిధ ముస్లిం మత శాఖల గురువులు చర్చల్లో ఆత్మ నియంత్రణ లేక పరస్పరం తిట్టుకునే దాకా వెళ్ళేవారు. వారి ఈ ప్రవర్తన, ఇస్లాం ప్రాథమిక సిద్ధాంతాల్ని సరిగా వివరించలేకపోవడం ఇవన్నీ అక్బరు ఇబాదత్ ఖానా ను ఇతర మతాలకి తెరిచి ఉంచేందుకు దోహదం చేశాయి.

ఫలితంగా 1578 తర్వాత హిందువులు, జైనులు, ~~[illegible]~~ 5
జొరాస్ట్రియన్లు, క్రైస్తవులు ఇబాదత్ ఖానా చర్చల్లో పాల్గొన్నారు. అయితే ప్రతి మతం వారూ ఇతర మతాలపై తమ ఆధిక్యత చాటుకొనేందుకు తద్వారా చక్రవర్తిని తమ మతంలోకి మార్చుకొనేందుకూ యత్నించడమే అధికంగా జరిగింది. దీనితో అక్బరు ఆధ్యాత్మిక తృష్ణను ఏ ఒక్క మతమూ శాంతి సమాధానం ఇవ్వలేకపోయింది. చివరికి అక్బరు ఈ చర్చలు, వాగ్వాదాలు నిరుపయోగమని ఎంచి వాటిని 1582 లో ఆపేశాడు.

అక్బరు ఇబాదత్ ఖానా నుండి తాను గ్రహించింది "నిజాన్ని తెలుసుకోవడం, వాస్తవాన్ని వెలికితీయడం" అని చెప్పుకున్నాడు. అతని కోరిక నెరవేరినా నెరవేరకపోయినా ఇబాదత్ ఖానా చర్చల వల్ల క్రింది ప్రయోజనాలు కలిగాయి.

1) ఈ చర్చల వల్ల అన్ని మతాల్లోనూ సత్య అంశాలు ఉన్నాయని అన్ని మతాలూ ఒకే అంతిమ వాస్తవానికే చేరతాయని అక్బరు అవగాహన చేసుకున్నాడు. అక్బరు మత భావాలు వృద్ధి చెందడం లో ఇదొక గొప్ప దశ, ఇది "సుల్హ్-ఇ-కుల్" సిద్ధాంతం పరిణామం చెందేందుకు దోహదం చేసింది. (అన్ని మతాల మధ్య శాంతి)

2) ఈ చర్చలు అన్ని ఉలేమాల ఇరుకైన ఆలోచనలు, మతమౌఢ్యం, అహంకారం వంటి వాటిని బహిరంగపర్చాయి. ఇది అక్బరు కు వారికి సంబంధాలు చెడేందుకు దారి తీసింది.

ఈ విధంగా ఇబాదత్ ఖానా చర్చలు మానవ ఉదార, సమానత్వంతో రాజ్యావిర్భావంలో కీలకపాత్ర పోషించాయి.

1579 లో అక్బరు విదుసరు ప్రముఖ ఉలేమాలు సంతకాలు చేసిన "మహాజర్" ను విడుదల చేశాడు.
ఇందులో ముఖ్యాంశాలు

*) ఈ ప్రకటన అక్బరు "ఇస్లాం సుల్తాను, మానవ జాతి కి రక్షకుడు, విశ్వాసపాత్రుల రక్షకుడు, భువిపై భగవంతుని నీడ" అని ప్రకటించింది. ఇవి ఆ కాలం లో ఖలీఫా కి చెందినవి. అయితే తైమూరీడ్లు మొదటి నుంచి ఖలీఫా వంటి బిరుదు అధికారాన్ని దేనినీ అంగీకరించలేదు.

* న్యాయమైన, తెలివైన పాలకుడి గా అక్బరు కు ప్రతి ఒక్కరి విధేయతని పొందే హక్కు గాక భగవంతుని దృష్టిలో అక్బరు హోదా పవిత్ర శాసనాల వ్యాఖ్యాత- ముజతహిద్ కన్నా ఉన్నతమైందని ప్రకటించబడింది.

* భవిష్యత్తులో మతసంబంధ ప్రశ్న ఏదైనా తలెత్తి ముజతహిదుల అభిప్రాయాలు భిన్నంగా ఉంటే చక్రవర్తి మానవజాతి సంక్షేమం కోసం, ప్రాపంచిక పాలనా వ్యవహారాల సక్రమ నిర్వహణ కు వాటిలో ఒక దానిని ఎన్నుకోవచ్చు.

* మానవాళి కి ప్రయోజనం కలిగించే ఉత్తమ శాసనాన్ని దేనినయినా (అది ఖురాన్ సూత్రాల్ని, హదీస్ ను వ్యతిరేకించనంత వరకూ) చేసే అధికారం అక్బరు కు ఉంది. అటువంటి శాసనాన్ని వ్యతిరేకించడం ఇహపర లోకాల్లో దివ్య అసంతృప్తి కి కారణం అవుతుంది.

" పూర్తిగా అధ్యయనం చేస్తే ఇది గొప్ప నిరంకుశాత్మక కృషి గా కన్పిస్తుంది,

ఇస్లాం న్యాయం లో పూర్తిగా అంగీకరిస్తుంది, ప్రాపంచిక ప్రభుత్వా-నికి షరియత్ కి మధ్య సర్దుబాటు కు ఒక ఆధారం (7) అందిస్తుంది."

— ఎస్. ఎమ్. ఇక్రామ్ & ఎస్. ఎ. రషీద్

మహాజర్ యొక్క అసలు ప్రాధాన్యాన్ని ఎస్.ఎ.ఎ. రిజ్వీ ఇలా వివరించారు.

"సుల్తాన్ కుల్ స్వాతంత్ర్య శక్తివంతంగా ప్రకటించడం లౌకికంగానే ఇదే. దీన్ని అక్బరు కచ్చితంగా అమలు పర్చాలనుకున్నాడు."

ఇది అక్బరు కు సనాతన ఉలేమాలకు మధ్య అంతిమ వేర్పాటు ను అనివార్యం చేసింది.

సుల్తాన్-ఇ-కుల్ సిద్ధాంతం లో అంతర్భాగమైన 'న్యాయ భావన' ని ఈ మహాజర్ నొక్కి వక్కాణించింది. రాజ్య యంత్రాంగం ప్రజల సంక్షేమం కోసమేనని అక్బరు ఈ మహాజర్ ద్వారా ఉలేమాలకి జ్ఞాపకం చేశాడు.

ముల్లాలు, ఉలేమాలు మతరాజ్యమైన మొగలు రాజ్యాన్ని లౌకిక భారత జాతి రాజ్యం గా మార్చాలన్న అక్బరు ఆశయానికి పెద్ద అడ్డంకం గా తయారయ్యారు. రాజ్య రాజకీయాల్లో ముల్లాల శక్తి ని ప్రభావాన్ని మహాజర్ ద్వారా అక్బరు గొప్ప దెబ్బ తీశాడు. తానే ప్రధాన ఇమామ్ లేదా ముస్లిం న్యాయ రక్షకుడి గా ముల్లాల ను తన అధీనం లోకి తెచ్చుకున్నాడు, వారిని తనకు లొబడేలా చేశాడు. ఇదే మహాజర్ ప్రధాన ప్రాధాన్యం. ఇది పైకి మతప్రకటన గా కన్పించినా చాలా

ప్రాముఖ్యమైన రాజకీయ ప్రభావాన్ని ఇది కలిగించింది. సనాతన ఉలేమాల దురదృష్టకర ప్రభావమునుంచి రాజ్య రాజకీయాలు విముక్తమవడాన్ని ఈ మహజర్ సూచిస్తుంది.

ముస్లిం న్యాయాన్ని ప్రకటించడమనే ప్రధాన సత్తా యొక్క ఒక అధికారాన్ని ఈ మహజర్ ద్వారా అక్బరు పొందాడు. ~~అయితే~~ ఒక విషయం పై ఉలేమాల అభిప్రాయాల్లో వైరుధ్యం ఉన్నప్పుడే అక్బరు జోక్యం చేసుకోగలడు. అప్పుడు కూడా వివిధ ఉలేమాల అభిప్రాయాల్లో తనకు సమంజసమనిపించిన ఒక దాన్ని ఎంపిక చేయడం మాత్రమే అక్బరు చేస్తాడు (తానుగా కొత్త అభిప్రాయం చెప్పడు).

---

"కొంత వాస్తవ జ్ఞానం అబ్బినట్లు అనిపిస్తున్నప్పుడు సత్యాన్ని ఒక మతానికే ఎందుకు పరిమితం చేయాలి? (ఉదాహరణకు ఇస్లాం లాంటిది, తులనాత్మకంగా కొత్తది, మహా ఐతే వెయ్యేళ్ళ పాతది)

— అక్బరు.

1579 లో అక్బరు అబ్దుల్లా సుల్తాన్‌పురి ని అబ్దున్ నబి
ని వాళ్ళ యాత్రికుల నాయకులుగా మక్కా పంపి ఉలేమాలని
తిరిగి రాకూడదని ఆజ్ఞాపించాడు. బెంగాలు, బీహారుల్లో
తిరుగుబాటు చేసిన ఉలేమాల్ని బంధీ చేసి జమునా నదిలో
ముంచివేయించాడు. రజ్వీ అన్నట్లు " ఉలేమాల కి వ్యతిరేకంగా
తీసుకున్న ఈ తీవ్ర చర్యలు పాలనా అవసరాల చేత నిర్దేశించ
బడినవే గాని అతని కి ఇస్లాం పట్ల లేదా సనాతన ముస్లిం ల పట్ల
ఉన్న ద్వేషం నుంచి జనించినవి కావు."

ఆధ్యాత్మిక వ్యక్తులకి, పండితులకి, పేదల్లో
ఉన్న శరణార్థులకి భూమిశిస్తు చెల్లించనవసరం లేని భూముల్ని
– మిల్క్ / మదద్-ఎ-మాష్ / సయూర్ఘల్ ఇచ్చేవారు. ప్రధాన సద్ర్
పర్యవేక్షణ లో ఈ వ్యవహారం ఉండేది. మొదట్లో ప్రధానంగా
ముస్లిములకే వీటిని ఇచ్చేవారు. అబ్దున్ నబి ప్రధాన సద్ర్
అయ్యాక ఈ విషయం లో బాగా అవినీతి చోటుచేసుకుంది.
దాంతో అక్బరు స్వయంగా జోక్యం చేసుకుని ఇక పై అవినీతి
తొలగించబడటమే గాక హిందువులు, జైనులు, పార్శీలు కూడా ఈ
భూములు పొందేలా చూశాడు. ముస్లిం పేదలకి 'ఖైరపుర'
హిందూ పేదలకి 'ధర్మపుర' సన్యాసులకి 'జోగిపుర' అనే
సత్రాల్లో అన్నదానాలు చేయించేవాడు. ఈ విధంగా సనాతన
ఉలేమాల ఆధిపత్యాన్ని అంతం చేసి రాజ్య ఆదరణ మతం
తో సంబంధం లేకుండా అన్ని మతాల్లో అవసరమైన వారికి
అందేలా చూశాడు.

## తృతీయ లేదా చివరి దశ (క్రీ.శ. 1581-1605)

అక్బరు ~~మతవిధానం~~ మత సమ్మేళాల కు మూలమైనది అతని రాజకీయ విశేష్వరోపాధన భావన - తౌహిద్-ఇ-ఇలాహి.

అన్ని మతాల్లోనూ సత్యమంత ఉన్నదని అయితే అది సంప్రదాయాల్ని గుడ్డిగా అనుకరించడం వల్ల (తక్లిద్) భారీ ఉత్సవాల నిర్వహణ వల్ల కనుమరుగైందని తలచాడు. అందువల్ల అతడు ఏదో ఒక మత సమ్మేళాలు, ఉత్సవాల కు తనను పరిమితం చేసుకోదల్చుకోలేదు. అయితే అన్ని మతాల్ని గౌరవించేందుకు అక్బరు సిద్ధంగా ఉండేవాడు. అందువల్లనే అక్బరు గోవధ్యను నిషేధించాడు; దసరా, దీపావళి వంటి ఉత్సవాల్ని నిర్వహించేవాడు, మధ్య ఆసియా సంప్రదాయం కు పార్సీల పండుగ నౌరోజ్ ను జరిపేవాడు.

"అతను తన అనుచరుల్ని ఇస్లాం ను వదిలి వేయమని చెప్పినట్లు కొందరు చరిత్రకారులన్నది సరికాదు. అతను వదిలి వేయమన్నది అందులోని సనాతనత్వాన్ని మాత్రమే"

— ఐ. హెచ్. ఖురేషి

"అక్బరు కోరుకున్నది రాజకీయ అవసరాల కు అనుగుణం గా సరళీకృతంగా ఉండే ఇస్లాం ను. పైగా అది ముస్లిం మేధావుల కు తగిన ఉత్తమరీతిలో కన్పించ గలగాలి"

— అబుల్ ఫజల్

నిజానికి అక్బరు కాలం లో సనాతన ముస్లింల బాధ కి కారణం ఇస్లాం గుర్తింపు పోతుందన్నది కాదు, ఇస్లాం ఆధిక్యత ఫలితంగా వారి ఆధిక్యత పోతుందన్నదే. అక్బరు కాలం నాటి ముస్లింల బాధ కు ముఖ్య కారణం.

## దీన్-ఇ-ఇలాహి

ఆధునిక పరిశోధనలు అక్బరు నూతన మతాన్ని స్థాపించదలిచాడనడాన్ని అంగీకరించవు. కొందరు ఆధునిక చరిత్రకారులు దీన్-ఇ-ఇలాహి కి ప్రవక్త లేడు, ఆచారాలు లేవు, నమ్మకాలు లేవు, గ్రంథాలు లేవు అని అన్నారు.

అబుల్ ఫజల్ దీన్-ఇ-ఇలాహి పదాన్ని వాడలేదు, తౌహీద్-ఇ-ఇలాహి (దివ్య ఏకేశ్వరోపాసన) పదాన్ని వాడాడు. అయితే బదౌని రెండు పదాల్నీ వాడాడు. అబుల్ ఫజల్ ఈ భావన ని అక్బరు ప్రజలకి "ఆధ్యాత్మిక మార్గదర్శి" గా ఉండడం గా చెప్పాడు. అక్బరు వ్యాఖ్యల్ని రెండింటిని అబుల్ చెప్పాడు

"మార్గదర్శకం అంటే మార్గాన్ని చూపించడం, అంతేగాని శిష్యుల్ని పోగేయడం కాదు."

"శిష్యుని గా చేయడమంటే అతన్ని భగవంతుని సేవ కు అంకితం చేయడమే గాని వ్యక్తిగత సేవకుల్ని చేసుకోవడం కాదు"

ఈ రెండు వ్యాఖ్యలూ అక్బరు ఆధ్యాత్మిక మార్గదర్శకత్వం / నాయకత్వం వహించడం వెనక గల అసలు ఉద్దేశాన్ని వెల్లడిస్తున్నాయి. నాయక స్థాయిలో చక్రవర్తి కి విధేయత ఉన్నదానిని దీన్-ఇ-ఇలాహి గా తరచూ పొరపాటు పడుతుంటారని చరిత్రకారులు సతీష్ చంద్ర అన్నారు.

సంపద, ప్రాణం, గౌరవం, మతం వీటితో ఎన్ని త్యాగం చేస్తే (చక్రవర్తి కోసం) వారికి అన్ని స్థాయిలు (degrees) దక్కుతాయి.

మతాన్ని త్యాగం చేయడమన్నది సంప్రదాయ, మార్గ అనుకరణ గా మతాచారాలను అనుసరించడం వంటివి వదిలి 'సుల్హ్-ఇ-కుల్' సూత్రాన్ని ఏ అటంకాలూ లేకుండా అవలంబించేందుకు తోడ్పడుతుంది.

ప్రజల దృష్టి లో నాలుగు స్థాయిల విశ్వాసమన్నది మతపరంగా కొంత ప్రాముఖ్యత కలిగిన అంశం. కాని అక్బరు అలా అనుకున్నట్లు కన్పించదు, నాలుగు స్థాయిల అంకిత భావం అన్నది ఉత్తమ హోదా గల వారికి, రాజకీయ అవసరాలకే.

ఆ కాలం లో నీతి నియమాలు గల ఉత్తమ హోదా అధికార్లు అందరూ ఈ గుణాలు కలిగి రాజకీయ, సైనిక అవసరాల్ని విస్తరిస్తున్న సామ్రాజ్యం & సామర్థ్యం నిండిన పరిపాలనల దృష్ట్యా నిర్వహించగల నైపుణ్యం గలవారు అయివున్నట్లు నా కన్పిస్తుంది. ఆధునిక చరిత్రకారుడు రిజ్వీ "

"మొఘలు సింహాసనం చుట్టూ కొత్త మొఘలు అధికార వర్గాన్ని ఏకీకృతం చేసేందుకు ప్రధాన శాస్త్రీయ బలాన్ని నాలుగు స్థాయిల అంకితత్వం అందించింది."

అని అభిప్రాయపడ్డారు.

దీన్-ఇ-ఇల్లాహి సూత్రాలు

1) ఉదార స్వభావం, దయాపరత్వం
2) పెద్దవారిని క్షమించగలగడం, కోపాన్ని శాంతం తో జయించడం
3) ప్రాపంచిక కోరికలకు దూరంగా ఉండడం
4) భౌతిక ప్రపంచం తో అనుబంధాన్ని పెంచుకోక పోవడం
5) ప్రతిపాదిత చర్యల అన్ని కోణాల్ని జాగ్రత్త గా ఆలోచించడం
6) ఉత్తమ కార్యాల్ని ధైర్యం గా చేయడం
7) మృదువైన గొంతు, గంభీరమైన భాషణ
8) సాటివారి తో సహృద్భావం గా వ్యవహరించడం
9) ముఖ్యకాలను పూర్తి గా పాటించలడం
10) భగవంతుని ప్రేమించడానికి జీవితాన్ని అంకితం చేయడం.

అక్బర్ దేశం లో మతాంధత్వం, మత ఘర్షణలు ఉండరాదని ప్రముఖులందరూ తనకు ప్రార్థన విధేయత కలిగి ఉండాలని కోరుకున్నాడు.

"కీర్తనం అన్నది బహుళత్వం నిండిన ప్రముఖుల సముదాయాన్ని గ్రహించడానికి వారందరిని సింహాసనానికి కట్టుబడి ఉండేలా చేసేందుకూ అది శక్తివంతమైన మార్గం గా తోడ్పడుతుంది"

— కె. ఎఫ్. రిచర్డ్స్

రాజమాతలు, ఉత్తమ హోదాగలవారు తమను తాము చక్రవర్తి "మురీద్" (శిష్యులు) లు గా చెప్పుకొనేవారు.

విన్సెంట్ స్మిత్ దీన్-ఇ-ఇలాహీ "అక్బరు ఘోర తప్పిదం యొక్క స్మారక చిహ్నం" అన్నారు. కాని ఇది సరికాదు.

నిందించారు. బదౌని అక్బరు ఇస్లాం ను వదిలేశాడని ఇస్లాం వ్యతిరేక చర్యలు చేపట్టాడని అత్యంత పవిత్ర ముస్లింలను వారి మతవిశ్వాసాల కారణంగా హింసించాడని రాశాడు. జెసూట్ మిషనరీలు కూడా అక్బరు మత్రత్రయానికి మద్దతివ్వలేక అక్బరు ని మతభ్రష్టత అబద్ధాలకోరు గా చిత్రించారు. నిష్పక్షపాత పరిశోధనల వల్ల ఈ నిందల్లో నిజం లేదని తేలుతుంది. ఈ నిందల్ని భూతద్దం లో చూపిన V.A. స్మిత్ దీన్ని ఇస్లాం ని అక్బరు తప్పుకి చిహ్నం గా చెప్పాడు. కాని ఇది తప్పు/సరికాదు.

అక్బరు DII ని స్వీకరించమని ఎవ్వరినీ బలవంతపెట్టలేదు, చక్రవర్తి గా అతను దాని సులభంగా చేయగలిగినా చేయలేదు. DII ని పూర్తిగా స్వీకరించిన వారిగా అబుల్ ఫజల్ 18 మందినే పేర్కొంది, అక్బరు అంతరంగికులు, నిస్వార్థ సేవకులు (అయిన రాజులా బీర్బల్ ఒక్కడే హిందూ. రాజా భగవాన్ దాస్, మాన్ సింగ్ లు DII లో చేరడానికి తిరస్కరించారు.* అయినా ఈ కారణంగా అక్బరు వారి పట్ల అసంతృప్తం లో ఉన్నట్లు ఎక్కడా కన్పించదు.

DII లో చేరిన ఉదారమైన భగవంతునికి భయపడే మేథావులు సాంప్రదాయకులకి తమ తమ మతల గర్వాన్ని నమ్మకాల్ని విడిచి [illegible] సమైక్యత ని పాటుపడేందుకు ఆదర్శంగా నిలిచారు.

ఈ విధంగా DII ద్వారా అక్బరు తన రాజకీయ నాయకత్వానికి తోడు నాటి భారతీయులకి నైతిక, ఆధ్యాత్మిక నాయకత్వాన్ని అందించాడు.

* [illegible] దీనికి ముఖ్య కారణాలు దిన్-ఇ-ఇలాహిలో అన్ని మతాలలోని మంచి అంశాలు ఉండటం వల్ల, ఏ ఒక్క తమకు ప్రత్యేకమైన దాన్ని ప్రవచించే ఏ ఒక్క మతానికి చెందిన వారిని ఆకర్షించే సమ్మిళితమైన మత భావాలను అది గాని ఏర్పరచుకోలేదు.

## సుల్హ్-ఇ-కుల్ సిద్ధాంతం

సుల్హ్-ఇ-కుల్ అంటే అందరికీ శాంతి. ఇది అక్బరు విధానం. అక్బరు పర్షియన్ గురువు అబ్దుల్ లతీఫ్ దీన్ని అక్బరుకు బోధించినట్లు తెలుస్తోంది. అక్బరు రాజ్య విధానం దీనిచే ప్రభావితమైంది. రాజపుత్రులతో సంబంధాలు(1) సుల్హ్-ఇ-కుల్ పై ఆధారపడ్డ, మొఘల రాజ్య విధాన ఆరంభాన్ని సూచిస్తాయి. అక్బరు రాజపుత్రులతో వైవాహిక సంబంధాలు ఏర్పరచుకున్నాడు. వ్యక్తిగత సంబంధాలు వల్ల రాజపుత్రులకే గాక సామర్థ్యం గల ఇతర రాజపుత్రులను కూడా మన్ననలిచ్చాడు. ఈ ఇతరుల్లో తోడరమల్, బీర్బల్ ముఖ్యులు.

అక్బరు యాత్రాపన్ను(2), జిజియా(3) రద్దు చేశాడు. యుద్ధ(4) ఖైదీల్ని బలవంతంగా మతమార్పిడి చేయడాన్ని నిషేధించాడు. ఒక సార్వభౌముడు తన ప్రజల పట్ల ఎలా ప్రవర్తించాలో తండ్రుల పట్ల(5) అక్బరు ప్రవర్తన అలా ఉండేది. ఈ భావన తైమూరిడ్, పర్షియన్ & భారతీయ సార్వభౌమ భావాల సమ్మేళనం. తన ప్రజల పట్ల ప్రేమ/ పితృప్రేమ(1), కుల-మతాది భేద(2) భావం చూపక పోవడం, విశాల హృదయం(3), క్రింది వర్గాల-ఉన్నత(4) వర్గాల వారి అందరి ఆశలూ తీర్చడం, సర్వత్ర నెలకొన్న భగవంతుని ఎడల భక్తి విశ్వాసాలు(5) ఒక సార్వభౌమునికి గొప్పదనాన్ని తెచ్చి పెడతాయని అక్బరు విశ్వసించాడు.

ఒక వృత్తి లేదా స్థాయికి చెందిన వారు మరొకరి వృత్తి లేదా స్థాయిల్లో అనవసర జోక్యం కల్పించు కోకుండా చూసి తద్వారా సమాజంలో(6) సమతౌల్యాన్ని

గణితం, వ్యవసాయం, జ్యామితి, ఖగోళం, ప్రభుత్వ పాలన, తర్కం, చరిత్ర వంటి లౌకిక విద్య కి అధిక ప్రాధాన్యం ఇచ్చాడు.

ముస్లిం మతం లో పన్నెండేళ్ల లోపు వారి (11) అనుమతి/ఇష్టం లేకుండా బాలుర కి circumcision సుంతీ చేయరాదని ఆజ్ఞాపించాడు.

సుల్హ్-ఇ-కుల్ విధానం ద్వారా అక్బరు తన యుగానికి ఎంతో ముందుకు పోయినవాడిగా కన్పిస్తాడు.

* అక్బరు లోని మానసిక, మౌలిక దృక్పథం కారణంగా అతడు సహజం గానే మతమౌఢ్యునిగా వ్యవహరించలేదు.

* కేవలం మత బంధమే తన వర్గం వారి ప్రేమ ని గెలుచుకునేందుకు దోహదపడదని అక్బరు స్వీయానుభవం ద్వారా తెలుసుకున్నాడు. స్వార్థపరులైన తన రక్తసంబంధీకుల నుంచే చాలా బాధలు పడ్డాడు. తరచూ తిరుగుబాట్లు చేస్తే, తన ప్రాణానికే ఎసరు పెట్టేలా ఉన్న, స్వీయప్రయోజ-నాలు చూసుకునే ముస్లిం ప్రముఖుల మీదా అతను ఆధారపడలేదు.

మరోవైపు పూర్తి అంకితభావం, ఉత్తమ సంస్కారం, తెలివితేటలతో రాజపుత్ర భార్యలు అక్బరు ప్రేమ ని గెల్చుకున్నారు. వారి బంధువులు మొగలు సింహాసనానికి నిస్వార్థ సేవ చేసి అక్బరు అభిమానం పొందారు. అక్బరు కాలంలో రాజపుత్రులు మొగలు సామ్రాజ్య సౌధ స్తంభాలు గా ఎదిగారు.

* హిందువుల పట్ల సహనం గా ఉండడం మాత్రమే చాలదు. అప్పుడు పెద్ద విభాగం లా మందిరి గా తనను ఉదాసీనం గా ఆమోదిస్తారు హిందువులు కూడా. కాని హిందువుల నమ్మకాన్ని పొంది సామ్రాజ్యాన్ని సుస్థిరం చేసుకోవడం లో హిందువుల క్రియాశీల సహకారం చాలా అవసరం. పైగా అక్బరు తన ప్రజలందరి సంక్షేమాన్ని నిజంగా మనస్ఫూర్తిగానే కోరుకున్నాడు. అందుకే తన కాలం నాటి మత, సాంఘిక చెడుగుల్ని నివారించేందుకు తీవ్రంగా యత్నించాడు.

# మొగలుల దక్కను విధానం

మొదటి ఇద్దరు మొగలు చక్రవర్తులకు దక్కను ను కలుపుకోవడానికి సీరియస్ గా ఆలోచించే సమయమే దక్కలేదు. బాబరు కు దక్కను మీద ఆసక్తి ఉండేది, అక్కడి రాజకీయ వ్యవహారాలు గురించి తెలుసుకుంటుండేవాడు, ఇది అతని స్వీయ చరిత్ర ద్వారా తెలుస్తుంది. కానీ భారత్ లో అతని కాలం చాలా తక్కువ మొత్తం ఉత్తర భారతాన్నే అతడు కలుపుకోలేక పోయాడు. ఇక హుమాయూను జీవితం గందరగోళం గా ఉండి ఉత్తర భారతానికే పరిమితమయ్యింది.

ఉత్తర భారతం పై తన ఆధిపత్య నెలకొల్పి తర్వాత దక్కను ఆక్రమణకై ఒక నిర్దిష్ట విధానాన్ని రూపొందించిన తొలి మొగలు చక్రవర్తి అక్బరు. దక్కను విధానం లో అక్బరు ఆశయాలు

1) తన ఆధిపత్యం లో అఖిల భారత సామ్రాజ్య స్థాపన.
2) రాజకీయ శక్తి గా ప్రాధాన్యత పొందుతున్న పోర్చుగీసు వారిని అణిచివేయడం.

దక్కను లో ఖాందేష్ అక్బరు సార్వభౌమత్వాన్ని అంగీకరించింది. అహ్మదనగర్, బీజాపూర్, గోల్కొండలు సున్నితం గా తిరస్కరించాయి. దౌత్య రాయబారం విఫలమవడం తో అక్బరు బలం ద్వారా తన ఆశయం సాధించదలిచాడు. ఈ ప్రయత్నం లో స్వయంగా అక్బరే దక్కను కు రావాల్సి వచ్చింది. అహ్మదనగర లో చాందుబీబీ గట్టి నిరోధం చూపింది. కానీ చివరికి అక్బరు ఆధిపత్య సాధించి సగానికి పైగా అహ్మదనగర ను సంపాదించాడు, అయితే మొత్తం అహ్మదనగర రాజ్యాన్ని మాత్రం షాజహాను కాలం దాకా ఆక్రమించలేక పోయారు.

దక్కను లో తాను జయించిన భూభాగాల్ని 
అప్పుడు అహ్మదునగర్, బీరార్, ఖాందేష్ లనే మూడు సుబాలు గా చేసి వాటిని తన కొడుకు డేనియల్ క్రింద ఉంచాడు. దాంతో మొగలుల దక్కను సరిహద్దు నర్మద నుండి కృష్ణానది ఉత్తరం వరకూ వ్యాపించింది.

జహాంగీరు తన తండ్రి దూకుడు విధానాన్ని (forward policy) కొనసాగించాడు. అహ్మదనగర్ రాజ్యం లో మిగిలిన ప్రాంతాల ఆక్రమణకు ప్రయత్నించాడు. అతని పాలనా కాలమంతా దక్కను లో యుద్ధం జరుగుతూనే ఉంది. కాని మాలిక్ అంబర్ [అహ్మదనగర ప్రధాన మంత్రి] కి గెరిల్లా యుద్ధం లో ఉన్న నైపుణ్యం; మొగలు సైన్యాధికారుల్లో ఉన్న గొడవలు, పోటీ వాటి కారణం గా జహాంగీరు అహ్మదనగరు ను ముట్టడించలేకపోయాడు.

షాజహాను చక్రవర్తి అయ్యాక తన పూర్వీకుల వలే విస్తరణ విధానాన్ని అవలంబించాడు. రాకుమారుడుగా ఉన్నప్పుడే షాజహాను (ఖుర్రం) అ.న. ను పట్టుకున్నాడు. అయితే ఈ విజయం నామమాత్రమయినదే, మొగలుల దక్కను సరిహద్దు 1605 లో ఎక్కడ ఉందో అక్కడే ఉండిపోయింది. షాజహాను చక్రవర్తి అయ్యాక అ.న. రాజ్యం లో ఇంకా స్వతంత్రంగా ఉన్న భూభాగాల్ని ఆక్రమించమని సైన్యాన్ని పంపాడు. మొగలుల అదృష్టం కొద్దీ మాలిక్ అంబర్ క్రీ.శ. 1626 లో చనిపోయాడు. సుల్తాను కు కొత్త ప్రధాన మంత్రి ఫతే ఖాన్ కు భేదాలు పొడసూపాయి. మొత్తం మీద షాజహాన్ భారీ లంచాలు, కుట్రల ద్వారా చివరికి అహ్మదనగర ను మొగలు సామ్రాజ్యం లో విలీనం చేశారు.

అప్పటికి షాజహాన్ షియా రాజ్యాలైన గోల్కొండ, బీజాపూర్ లపై దృష్టి నిల్పాడు. గోల్కొండ అతని సార్వభౌమునిగా అంగీకరించింది. బీజాపూర్ సుల్తాన్ ఒప్పుకోకపోతే అతని రాజధాని ముట్టడించి బలవంతంగా ఒప్పించాడు.

ఔరంగజేబు రాజప్రతినిధిగా గోల్కొండ పై దండెత్తగా గోల్కొండ భారీ నష్టం చెల్లించి రంగీర్ జిల్లాను మొగలు సామ్రాజ్యంలో విలీనం కి ఇచ్చివేసింది. ఔరంగజేబు బీజాపూర్ పై దండెత్తి బీదర్, కళ్యాణ్ ముట్టడించగా షాజహాన్ జోక్యం చేసుకొని మొగలు సైన్యాన్ని వెనక్కి మరలాల్సిందిగా ఆజ్ఞాపించాడు. బీజాపూర్ భారీ నష్టం చెల్లించి బీదర్, కళ్యాణ్, పరెండ లను మొగలుల కి ఇచ్చివేసింది.

# ఔరంగజేబు దక్కను విధానం

రాకుమారుడి గా ఔరంగజేబు షాజహాను పై ఒత్తిడి తెచ్చిన దక్కను విధానం అంటే దక్కను రాజ్యాలైన బీజాపూరు, గోల్కొండ లను పూర్తిగా మొగలు సామ్రాజ్యం లో విలీనం చేయడం అనేదాన్ని అతడు చక్రవర్తి అయ్యాక మాత్రం వెంటనే అమలు చేయలేదు. ఇందువల్ల మధ్యలో దాదాపు మూడు దశాబ్దాలు గడిచిపోయాయి.

ఈ మధ్యకాలాన్ని (1658 - 1687) మూడు దశలు గా చెప్పవచ్చు.

మొదటి దశ : (1658 - 1668)

1636 ఒప్పందం ద్వారా అహ్మదునగర్ మొగలుల కి లొంగిపోయింది. కాని దాని ప్రాంతాలు కొన్ని బీజాపూరు ఆధీనం లో ఉన్నాయి. ఆ ప్రాంతాలన్ని సంపాదించేందుకు యత్నించడం ఈ దశ లో ప్రధానం గా సాగింది.

రెండవ దశ : (1668 - 84)

ఈ కాలం లో దక్కను లో ప్రధాన ప్రమాదం గా మరాఠాల్ని ఎంచారు. మరాఠాల కి వ్యతిరేకం గా మొగలులతో చేయి కలపమని గోల్కొండ, బీజాపూరు లపై ఒత్తిడి చేయడం ఈ దశ లో ముఖ్యమైంది.

మూడవ దశ : (1684 - 87)

మూడవ దశ 1684 లో మొదలైంది. మరాఠాల కి వ్యతిరేకం గా గోల్కొండ, బీజాపూరు ల మద్దతు అందదని ఔరంగజేబు నిశ్చయానికి వచ్చి, మరాఠాల్ని

నాశనం చేయాలంటే దానికి ముందుగా బీజాపూర్, గోల్కొండలను స్వాధీనం చేసుకోవాలని నిర్ణయించుకున్నాడు.

సింహాసనానికి రాగానే ఔరంగజేబు దక్షిణ లో రెండు సమస్యలు ఎదుర్కొన్నాడు. ఒకటి నానాటికి పెరుగుతున్న శివాజీ శక్తి; ఇక రెండవది 1636 ఒప్పందం ద్వారా మొగలులకి చెందాల్సిన భాగాల్ని తప్పుకొనేట్లు బీజాపూర్ పై ఒత్తిడి తేవడం. కళ్యాణి, బీదరు లను 1657 లో సంపాదించారు. 1660 లో లంచాల ద్వారా పరెండ వశపర్చుకున్నారు. షోలాపూర్ ఇంకా మిగిలి ఉంది. చక్రవర్తి అయ్యాక ఔరంగజేబు జైసింగ్ తో శివాజీని ఆదిల్షా ని శిక్షించమని చెప్పాడు, ఇది అతనికి మొగలుసైన్య ఆధిక్యాల మీద ఉన్న నమ్మకాన్ని శత్రువులని తక్కువ అంచనా వేయడాన్ని తెల్పుతుంది.

జైసింగ్ బీజాపూర్ ఆక్రమణ కి పథకం వేస్తే ఔరంగజేబు కి "బీజాపూర్ ఆక్రమణ మొత్తం దక్షిణ, కర్నాటకల ఆక్రమణ కి నాంది" అని రాశాడు. కాని ఔరంగజేబు ఈ సామ్రాజ్యవాద విధానం కి అంగీకరించలేదు.

ఇరాన్ పాలకుడు వాయువ్యం లో భయపెట్టే రీతి లో వ్యవహరిస్తుండడం, దక్షిణ ఆక్రమణ చాలా సుదీర్ఘమైనదై ఖర్చుతోకూడిందై స్వయంగా చక్రవర్తే పదవి రావాల్సివస్తుంది - భారీ సైన్యాన్ని ఒక ప్రముఖుడి చేతిలోనా అప్పగాల రాదనుకొనడి

చేతిలోనే దీర్ఘకాలం ఉంచడం ప్రమాదం కాబట్టి - 27
షాజహాను ఈ రీతిగానే దురదృష్టవంతుడు ఐనాడు.
అయినా షాజహాను ఢిల్లీ లో బ్రతికుండగానే ఔరంగజేబు
దీర్ఘకాల దండయాత్రలకు దూరంగా ఎలా వెళ్ళగలడు?
పై కారణాల దృష్ట్యా ఈ దశలో ఔరంగజేబు దక్షిణ
ను ఆక్రమించేందుకు కారణ చూపలేదని ఊహించ
వచ్చు.

జైసింగ్ ప్రాంతాన్ని సంపాదించలేదని
మీదుగా (1667) ఆ తర్వాత (1668) మొగలులు
లంచాల ద్వారా ప్రాంతాన్ని సంపాదించారు. దాంతో
మొదటి దశ ముగిసింది.

1672 లో అలీ ఆదిల్షా మరణం తో
బీజాపూర్ లో అంతర్గత బలహీనతలు పెరగసాగాయి.
శివాజీ ఆధారపడదగ్గవాడు కాడు, పైగా పెద్ద ఆశయాలు
గలవాడన్న అభిప్రాయం ఔరంగజేబు కి ఉంది కాబట్టి
ఈ స్థితి లో జేబు కి మూడు విధానాల పై అవకాశం
ఉంది.

1) దక్షిణ రాజ్యాల పట్ల ఏం జరిగినా అంటే బీజాపూర్
పై శివాజీ ఒంటరిగా గాని గోల్కొండ తో కలిసి గాని
ఆధిపత్యం ఏర్పరిచినా పూర్తి గా గట్టి రక్షణ
విధానాన్ని అవలంబించడం.

2) మరాఠా దాడుల కి వ్యతిరేకంగా బీజాపూర్ ను
ప్రోత్సహించడం, దానికి ఇష్టం లేకపోయినా బీజాపూర్

ఆ స్థానం లో ఏదో ఒక మొత్తం ద్వారానైనా దాన్ని సాధించడం వీలయితే గోల్కొండ ని కూడా ఈ కార్యం లో చేర్చుకోవడం

3) రెండు దక్షిణ రాజ్యాల్ని లేదా బీజాపూర్ లో మొదలు పెట్టి పూర్తిగా ఆక్రమించేసుకోవడం.

వీటిలో మొదటిది జేబు ఎప్పుడూ సీరియస్ గా ఆలోచించలేదు. ~~అయితే~~ ఈ మొదటి విధానం మిగిలిన వాటంత హానికరమైనది కాదని చెప్పవచ్చని సతీష్ చంద్ర అభిప్రాయం. 1656 తర్వాతి ఘటనలు, మొఘలు సామ్రాజ్య స్వభావం, జేబు దృఢమైన విధానం- (అవసరమైనచోట ఆక్రమణల లో సహా) ఇవన్నీ ఉదాసీన (masterly inactivity) విధానాన్ని దూరం చేశాయి. అందువల్ల జేబు రెండవ విధానం చుట్టూ తిరిగి చివరికి 1684 లో చివరికి తన స్వీయానుభవం ద్వారా మొత్తాన్ని పూర్తిగా ఆక్రమించడం తప్పితే దక్షిణ రాజ్యాలు ఎన్నటికీ చేయబడవని అర్థం చేసుకుని రెండవ విధానాన్ని వదిలి మూడవ విధానాన్ని చేపట్టాడు.

బీజాపూర్ లో బాలుడు రాజు కాగానే ఆ రాజ్య బలహీనత పెరుగుతుండడం లో ( ఆ స్థానం లోని మొత్తం తగాదాల వల్ల) జేబు ఫార్వర్డ్ పాలసీ (forward policy) ని అవలంబించాడని షా ఆలం బదులుగా "శక్తివంతమైన, విజయవంతమైన" సేనాని బహదూర్ ఖాన్ ను దక్షిణ సుబేదారు గా నియమించడం (1673 లో) దీన్ని సూచిస్తుందని జదునాథ్ సర్కార్ భావించారు. ఇది ఔరంగజేబు

దక్షిణ విధానం లో రెండవ దశ ని సూచిస్తుంది. 29

కాని ఈ దశ లో జేబు లక్ష్యాలు ఇంకా పరిమితంగా గానే ఉన్నాయని సతీష్ చంద్ర అంటారు. బహదూర్ ఖాన్ కు ఎటువంటి అదనపు బలగాలు క్రమంగా[redacted]క పోవడాన్ని ఇందుకు నిదర్శనం గా చూపారు.

పెరుగుతున్న మరాఠా శక్తి ని తీవ్రంగా గమనిస్తున్న ఔరంగజేబు దక్కను లో మొఘలుల విస్తరణ ని పరిమితం చేయాలనుకుంటున్నట్లుగా ఈ దశ లో కన్పిస్తాడు. అందువల్లే బీజాపూర్ లో శివాజీ కి వ్యతిరేకంగా మొఘలుల కి సహాయం చేసేది, గోల్కొండ చేత నడపబడనిది అయిన ఒక ముఠా ని తయారు చేయడానికి పదేపదే ప్రయత్నించాడు.

దక్కను లో బహదూర్ ఖాన్ "cautious and conciliatory" విధానాన్ని అవలంబించాడు. బహదూర్ ఖాన్ ఎంత ప్రయత్నించినా బీజాపూర్ నుంచి గుల్బర్గా, నలదుర్గ లని జయించాడే గాని జేబు ఆశ నెరవేరలేదు.

ఈ పరిమిత విజయాల్లో జేబు అసంతృప్తి చెందాడు. బహదూర్ ఖాన్ బదులు దిలేర్ ఖాన్ ని నియమించాడు. దిలేర్ బహదూర్ ఖాన్ విధానాన్ని అంటే బీజాపూర్ లో ఆఫ్ఘన్ల కి వ్యతిరేకం గా దక్కని పార్టీ తో కూటమి కట్టడాన్ని వెనక్కి మళ్లించాడు. దిలేర్, ఆఫ్ఘన్ నాయకుడైన బహలోల్ ఖాన్ లు కలిసి గోల్కొండ పై దండెత్తాలని తర్వాత ఉమ్మడిగా శివాజీని అణచేయాలని తలచారు. కాని గోల్కొండ పై దాడి (1677) విఫలమయ్యింది. అంతేగాక ఇది అప్పటి వరకు ఉన్న మొఘలుల కి వ్యతిరేకంగా ఐక్య దక్కను కూటమి నిర్మించాలన్న విధానాన్ని బలోపేతం చేసింది.

మొగలుల దౌత్య, సైనిక శక్తి వల్ల కలిగిన ఒకే ఒక ఫలితం – మొగలులకి వ్యతిరేకంగా మూడు దక్షిణ శక్తులు ఐక్య కూటమి (united front) గా ఏర్పడడం. మొగలుల భూభాగాన్ని మరాఠాల దాడులకి తెరిచి పెట్టడం తప్ప దిలేర్ ఖాన్ సాధించింది ఏమీ లేదు.

ఒక నిర్దిష్టమైన విధానం లోపించడం అన్నది ఈ దశ లో స్పష్టంగా గా కన్పిస్తుంది.

జెబు మరాఠాల్ని నిర్మూలించలేదు. అలాగని మరాఠాలకి వ్యతిరేకంగా మొగలులతో దక్షిణ రాజ్యాలు కూటమి ఏర్పర్చేలా కూడా చేయలేకపోయాడు. బీజాపూర్ కి వ్యతిరేకంగా చిన్నకంటకాలు (pinpricks) వేయడం, దాని భూభాగాన్ని కొద్ది కొద్ది గా (nibbling) ఆక్రమించ ప్రయత్నించడం వంటి నిష్ఫల విధానాన్ని అవలంబించాడు.

1680 లో రాజకుమారుడు అక్బరు కోసం జెబు దక్షిణ కు రావడం కూడా దక్షిణ రాజ్యాల పట్ల మొగలుల విధానం లో స్పష్టమైన మార్పు ఏదీ తీసుకురాలేదు. జెబు మొదట మరాఠాల మీద దృష్టి కేంద్రీకరించాడు, మరొసారి మరాఠాల కి వ్యతిరేకంగా మొగలులతో చేతులు కలపేందుకు దక్షిణ రాజ్యాల పై ఒత్తిడి తెచ్చి అంగీకరింప చేసేందుకు ప్రయత్నించాడు.

మూడవ దశ (1684-87) మొట్టమొదటసారిగా దక్షిణ రాజ్యాలు మరాఠాల కి వ్యతిరేకంగా తనతో ఏకమవ్వాలని చేతులు కలపవలసిన నిర్ణయానికి వచ్చాడు.

1684 నాటికి జెబు మొదటగా దక్షిణ రాజ్యాల్ని పూర్తిగా ఆక్రమించుకోవాలనే తన ఆశయాలు నెరవేరవన్న నిర్ణయానికి వచ్చాడు. దీన్ని జెబు

దక్షిణ విధానం లో మూడవ దశ కి సూచిక గా చెప్పుకోవచ్చు.

ఔరంగజేబు ఆదిల్షా ను పిలిచి సామంతుడిగా మొఘలుసామ్రాజ్యసేన కి సదుపాయాలు కల్పించమని, మొఘలుసేన ని తన భూమి లో స్వేచ్ఛగా సంచరించమని, మరాఠాల తో యుద్ధానికి ఐదారు వేల అశ్వదళాన్ని పంపమని, మొఘలు ప్రాంతీయ అధికారి షార్జాఖాన్ ని ఆలకించమని చెప్పాడు. యుద్ధం తప్పనిసరి అయ్యింది. మరాఠా, గోల్కొండ సాయం అందినా 1686 లో బీజాపూర్ ఆక్రమించబడింది. జేబు కుతుబ్ షా మొత్తం రాజ్య వ్యవహారాలన్నీ జిమ్మీల (ముస్లిమేతరుల) చేతుల్లో ఉంచాడని ఇస్లాం ను స్వేచ్ఛగా ఆచరించనీయడం లేదని ఆరోపించాడు. 1687 లో గోల్కొండని కూడా కబళించాడు.

ఇంతకు ముందులా దక్షిణరాజ్యాల ఆక్రమణ కి సిద్ధపడని జేబు ఈ దశ లో వాటిని ఆక్రమించడానికి రాజ్య ఉలేమాలు కాంక్ష కోసం ఒత్తిడి పెట్టడం ఒక కారణమన్న దానిని కొట్టి పారేయలేము.

చివరి దశ (1687 - 1707)

బీజాపూర్, గోల్కొండ ల పతనం తర్వాత జేబు తన శక్తినంతా మరాఠాల మీద కేంద్రీకరించసాగాడు. 1689 లో సంగమేశ్వర వద్ద మొఘలుసైన్యం శంభాజీ ని పట్టుకుని వధించింది. ఔరంగజేబు చేసిన గొప్ప రాజకీయ తప్పిదాల్లో ఇదొకటి. మరాఠాలతో సయోధ్య కుదుర్చుకుని బీజాపూర్, గోల్కొండ ఆక్రమణలతో

దక్షిణ పర్యాటన ముగిస్తే బాగుండేదని చరిత్రకారుడు సతీష్ చంద్ర అభిప్రాయపడ్డారు. శంభాజీ ని వధించి ఈ అవకాశాన్ని జారవిడుచుకోవడమే గాక మరాఠాల పోరాటానికి ఒక కారణాన్ని కల్పించాడు. ఒక కేంద్రీకృత స్థానం లేకపోవడం లో మరాఠా సర్దార్లు మొగలు భాగాల్ని యధేచ్ఛగా దోచుకున్నారు, మొగలు సైన్యం కూడటి చికాకుగా పరిగెత్తేవాళ్ళు. దక్షిణ లో మరాఠా శక్తి ని నాశనం చేయడానికి బదులుగా జేబు దక్షిణ లో మొగలుల పై మరాఠాల ప్రతిఘటన ని అన్ని విధాలా బలోపేతం చేశాడు.

శంభాజీ తర్వాత రాజారాం ను రాజు చేశారు. మొగలుల దాడి వల్ల రాజారాం తూర్పు తీరాన ఉన్న "జింజి" లో రక్షణ పొందాడు. దాంతో మరాఠా ప్రతిఘటన పశ్చిమతీరం నుంచి తూర్పుతీరానికి వ్యాపించింది.

1690 తర్వాత మరాఠా శక్తి అణచివేయబడిందని తలచి జెబు సంపన్నమైన కర్ణాటక భూమిని ఆక్రమించుకున్నాడు. కాని జెబు తాను నడుపగలదానికన్నా ఎక్కువగా కోరాడు. మరాఠా దాడులకి బాగా అవకాశం ఉన్న భూముల్లోకి అనవసరంగా తన సంబంధాలు విస్తరించాడు. మరోవైపు బీజాపూర్, గోల్కొండల కి సరైన పరిపాలన ని ఇవ్వలేదు.

1690 - 1703 ల మధ్య జెబు మరాఠాలతో సంప్రదింపులకి తీవ్రంగా వ్యతిరేకించాడు.

1698 లో జింజీ కోట చేజిక్కినా రాజారాం తప్పించుకోవడమే గాక ఆ తర్వాత పలు మరాఠా కోటల్ని పునరాక్రమించి సతారా కూడా చేరగలిగాడు.

పట్టువదలని విక్రమార్కుడిలా జేబు 1700-1705 ల మధ్య అన్ని మరాఠా కోటల్ని తిరిగి గెలుచుకొందుకు యత్నించాడు. వరదలు, వ్యాధులు, మరాఠాల ఆకస్మిక దాడులు మొగలు సైన్యాన్ని భారీగా నష్టపరిచాయి. విసుగు, అసంతృప్తి క్రమంగా రాజ ప్రముఖుల్లో సైన్యం లో పెరగసాగాయి. అవినీతికి చోటు చేసుకుని అనేకమంది జాగీర్దార్లు మరాఠాలతో రహస్య ఒప్పందాలు చేసుకుని మరాఠాలు వారి జాగీర్లని నాశనం చేయకుండా ఉంటే 'చౌత్' చెల్లిస్తామని అంగీకరించారు.

1703 లో జేబు మరాఠాలతో సంప్రదింపులు మొదలు పెట్టాడు. సాహు (శంభాజీ కొడుకు) కి శివాజీ స్వరాజ్య ఇవ్వడానికి, దక్కను మీద సర్దేశముఖి హక్కు ఇవ్వడానికి తద్వారా అతని ప్రత్యేక హోదా గుర్తించడానికి జేబు అంగీకరించాడు. కాని చివరి నిమిషం లో జేబు మరాఠాసర్దార్ల మీద అపనమ్మకం తో ఈ పధకాన్ని విరమించాడు.

1706 నాటికి అన్ని మరాఠా కోటల్ని ఆక్రమించాలన్న తన ప్రయత్నం నిష్ఫలమయ్యిందని జేబు గ్రహించాడు. దాంతో క్రమంగా ఔరంగాబాదు కు తరలిపోయాడు.

# మొగలు సామ్రాజ్య పతనం – ఔరంగజేబు బాధ్యత

మొగలు సామ్రాజ్య పతనానికి ఔరంగజేబు బాధ్యత మీద భిన్నాభిప్రాయాలు పండితుల్లో ఉన్నాయి. ఔరంగజేబు మరణం తర్వాత రెండు దశాబ్దాల లోపే మొగలు సామ్రాజ్యం దాదాపుగా కూలిపోయి నాశనమవడం మొదలైంది, అన్నది మాత్రం చారిత్రక సత్యం.

కొందరు చరిత్రకారులు హిందువులకి విచ్ఛిన్నకర శక్తుల్ని ఎదుర్కొనేందుకు ఔరంగజేబు పోరాడాల్సి వచ్చిందని, సామ్రాజ్య రక్షణకై ముస్లిం మద్దతుకోసం చేయాల్సి వచ్చిందని అయితే హిందువులూ షియాలు అనా మరాఠాలు, దక్షిణ రాజ్యాలు చేతులు కలపడం వల్ల ఈ ప్రయత్నాలు విఫలమయ్యాయని అంటారు. మరోవైపు జదునాథ్ సర్కార్[1] వంటి వారు ఔరంగజేబు అంతా మింగుదామని ప్రయత్నించాడని దాంతో "మొగలు సామ్రాజ్యం దాని సొంత భారం చేతనే కూలిపోయిందని" వ్యాఖ్యానించారు.

బాబరు, అక్బరు వంటి తన పూర్వీకుల మాదిరి గా కాక జేబు మద్యం, సంగీతం ప్రవహించే విందుల సభల్ని నిషేధించడం పై ఆసక్తి చూపాడు. దాంతో జేబు అందుబాటులో[2] లేని పాలకుని గా మారాడు. ఇది ఒక వ్యక్తి కోణానికి నప్పుతుందేమో కాని రాజకీయ నిర్ణయీకరణ లో సంప్రదింపులు, భాగస్వామ్య భావన లాంటివి అవసరమైనవి. జేబు ఈ వాస్తవాన్ని గమనించలేదు. ఆశ్రితుల బిజాపూరు, గోల్కొండ విషయం లో తన

సలహా ఇచ్చేందుకు ప్రయత్నం చేసిన సొంత కొడుకు రాజమారాయుడు మొ॥ వారిని కూడా జేబు జైలు పాలు చేయడం శోచనీయం.

ఔరంగజేబు ఉలేమాలని వాడుకోవాలని వారి ద్వారా ముస్లిములందర్నీ తనకు మద్దతిచ్చేలా మలచుకోవాలని చేసిన ప్రయత్నం కూడా అంతగా విజయవంతం[3] కాలేదు. జజియా పన్ను కు నియమించబడిన అమీన్లు రవబడే కాజీల విషయంలో నియంతలమైనట్లు అనేకమంది ఉలేమాలు అవినీతిపరులు గా ఉన్నారు.

ఔరంగజేబు కాజీలకు[4] అనవసర ప్రాధాన్యత ఇవ్వడం తో వారి శక్తి బాగా పెరిగి పోయింది. మహాబత్ ఖాన్ 1676 లో ఆ విషయమై జేబు కు రాసిన లేఖలో తన అసంతృప్తిని భయాన్ని వ్యక్తం చేశాడు.

see page : 40

జేబు మరాఠా-మొఘలుల పట్ల ప్రవర్తించిన తీరు సరైంది కాదు, అతని కి గాని వేరొకరు ప్రభుత్వానికి గాని ఏమీ సాధించలేదు. అతడు మరాఠా ఉద్యమ స్వభావాన్ని అర్థం చేసుకోవడం లో విఫలం చెందాడు. ఎన్ని అవకాశాలు వచ్చినా శివాజీ తో గాని అతని వారసులతో గాని స్నేహ సంబంధాలు ఏర్పర్చుకోలేదు. ముస్లిమేతరులైన మరాఠాలకు వ్యతిరేకంగా దక్కను ముస్లిం రాజ్యాల మద్దతు పొందాలన్న అతని ఆశ నెరవేరలేదు. అతనికి ఈ ఆశ పై భ్రమలు లేకపోయినా అనేక మంది ప్రముఖులు రాజమారాయుడు మొ॥ వారిస్తున్నా వినకుండా దక్కను రాజ్యాల్ని కబళించాడు. దక్కనులోని

సుదీర్ఘ యుద్ధం మొఘలు పరిపాలన వ్యవస్థ లోని పలు అంతర్గత బలహీనతలను పైకి తెచ్చింది.



— o —

మొఘలు సామ్రాజ్య పతనం లో వైరుధ్యాలు బాంధవ్యాల ని గుర్తిస్తూనే అతని పాలనలో ఆర్థిక, సాంఘిక, పరిపాలన, మేధో సందర్భం వంటి నాటి భారతదేశ పరిస్థితుల దృష్ట్యా అతని పాలనకి ముందు వెనుకా కాలం లో నెలకొన్న అంతర్జాతీయ పరిస్థితుల దృష్ట్యా అధ్యయనం చేయడం ఇటీవల చరిత్ర అధ్యయనం లో మరింతగా చోటుచేసుకుంది.

17 వ శతాబ్దంలో భారతదేశంలో వ్యవసాయం, వర్తక వాణిజ్యాలు, చేతివృత్తుల-ఉత్పత్తులు బాగానే వృద్ధి చెందాయి. కాని ఇవి అవసరాలకి తగినంతగా పెరగలేదు. ఉత్పత్తి పెరుగుదల నెమ్మదిగా ఉంటే పాలక వర్గాల (1) వారి కోరికలు మాత్రం తీవ్రంగా పెరిగాయి. కులీనుల సంఖ్య పదింతలు పెరిగ్గా సామ్రాజ్య ఆదాయ వనరులు పెరిగినా సమాన నిష్పత్తి లో పెరగలేదు. పైగా షాజహాను అట్టహాస యుద్ధాన్ని ఆరంభించాడు. అప్పటికే ప్రపంచం లోనే అధిక జీతాలు పొందుతున్న కులీనుల జీతాల్ని మరింత పెంచాడు.

కులీనుల్లో చాలామంది వర్తక వ్యాపారాలు చేసినా చాలా మందికి భూమి మీది ఆదాయమే ప్రధాన ఆదాయం. 17 వ శతాబ్దం తొలి భాగం లో ధరలు దాదాపు రెండింతలవడం తో సమస్య తీవ్రమైంది. దాంతో రైతుల్ని జమిందారుల్ని ఎంత వీలైతే అంత పిండి భూమి నుంచే తమ ఆదాయాల్ని పెంచుకోవాలని ప్రయత్నించారు.

కి సేవ చేసిన వారి కొడుకులు, అట్టిష్ట ప్రభుత్వ ఆదరణ /సర్వీసు మీద ఆధారపడి ఉన్నారు, అది రాకపోవడం తో వారి అసంతృప్తి తీవ్రమైంది.

పరిపాలనా యంత్రాంగం లో మొగలులు వివిధ (విరోధ - సమూహాల) స్థాయిలలో "చెక్స్ అండ్ బ్యాలెన్సెస్" వ్యవస్థ ని చాలా జాగ్రత్తగా ఏర్పరిచారు. తద్వారా వైవిధ్య జాతి, మత వర్గాల కి చెందిన కులీనులైన వ్యక్తుల లేదా వర్గాల స్వార్థ ఆశయాల్ని నియంత్రణ లో ఉంచేందుకు భిన్న వర్గాల మధ్య సమతౌల్యాన్ని సాధించేందుకు సృష్టి చేశారు. ఔరంగజేబు వారసులు (X) ఈ పరిపాలనా వ్యవస్థ ని క్షీణించేందుకు తావిచ్చినపుడు మాత్రమే కులీనులు స్వతంత్రతా పవనాలు వీయించారు. [(X) మరియు జాగీర్దారీ వ్యవస్థ యొక్క క్రమ క్షీణత నేపథ్యంలో]

(6) అందువల్ల మొగలు సామ్రాజ్య క్షీణత అనేది మొగలుల పరిపాలనా వ్యవస్థ వల్ల వేగిరపరచబడలేదు, మొగలు పరిపాలనా వ్యవస్థ క్షీణించడం వల్ల మాత్రమే అది వేగిరపరచ బడింది. (The disintegration was speeded up not because of but as a result of the breakdown of the Mughal adm system.)

మొగలుల పరిపాలనా వ్యవస్థ తీవ్రంగా (7) కేంద్రీకరించబడింది, దాన్ని నడపడానికి చాలా సమర్థులైన పాలకులు కావాలి. అలాంటి పాలకులు లేనప్పుడు వజీర్లు పెత్తనం చెలాయించ యత్నించారు, కాని వారు విఫలమయ్యారు. అందువల్ల వ్యక్తిగత వైఫల్యాలు వ్యవస్థాగత వైఫల్యాలు ఒకదానిపై ఒకటి పనిచేశాయని చెప్పవచ్చు.

(5)

రాజకీయ రంగంలో ఔరంగజేబు అనేక తీవ్ర తప్పిదాలు చేశాడు. <u>మరాఠాఉద్యమ</u> వాస్తవ స్వభావాన్ని అర్థం చేసుకోలేక పోయాడు, శివాజీతో సత్సంబంధాలు ఏర్పర్చుకోవాలన్న జైసింగ్ సలహాను పెడచెవిన పెట్టాడు. తన శంభాజీని వధించడం మరో పెద్ద తప్పు. ఇది మరాఠాలలో సంప్రదాయాలకు గుర్తింపుగల నాయకుడు లేకుండా చేయడమే గాక తదుపరి మరాఠాల పోరాటానికి చట్టబద్ధ స్వరూపాన్ని అందించింది.

జేబు కి <u>మరాఠాలతో చర్చలు జరిపే ఉద్దేశమే లేదు</u>. బీజాపూరు, గోల్కొండల ఆక్రమణ తర్వాత మరాఠాలు తన దయాదాక్షిణ్యాల మీద ఆధారపడ్డారని తన షరతులకు అంగీకరించక తప్పదని జేబు తలచాడు — ~~[illegible]~~. జేబు తన తప్పిదం తెల్సుకొని మరాఠాలతో సంప్రదింపులు మొదలుపెట్టాక చౌత్, సర్దేశ్‌ముఖ్ డిమాండు ప్రధాన అవరోధం గా పరిణమించింది. మొత్తం మీద అదీ అంగీకరించి <u>1703</u> లో నాటికి <u>దాదాపుగా</u> <u>ఒప్పందం కుదిరింది</u>, <u>కాని</u> ఔరంగజేబు సాహు మీద <u>మరాఠా సర్దార్ల</u> మీద నమ్మకాన్ని ఉంచలేకపోయాడు.

ఔరంగజేబు మరాఠా సర్దార్లని నమ్మలేదు. రాజపుత్రుల మాదిరిగా గాక మరాఠాల కి సన్మానం, బాధ్యత గల పదవుల్ని ఎప్పుడూ ఇవ్వలేదు.

దాంతో మరాఠాలు మొగలు రాజకీయ వ్యవస్థ 47
లో ఎప్పటికీ సమైక్యం చేయబడలేదు. ఇక్కడ
మరోసారి శివాజీ లేదా అతని వారసులలో రాజకీయ
సయోధ్య గొప్పమార్పు కలిగించి ఉండేదని చెప్పవచ్చు.

షాజహాను కాలం లోనే 1636 ఒప్పందాన్ని
కాలరాయడం జరిగింది. కాబట్టి ఔరంగజేబు కు దక్షిణ
రాజ్యాల కు నడుమ హృదయ శత్రుత్వ అన్నది (6) "మానసిక
అసంభవత్వం" (Psychological impossibility). దీన్ని
జేబు గ్రహించలేకపోయాడు. అందుకే దక్షిణ రాజ్యాల
ఆక్రమణ ని వీలయినంత కాలం వాయిదా వేసి వాటిని
తన వైపు త్రిప్పుకోవాలని విఫలయత్నం చేశాడు.

మొగలుల పరిపాలన ని గోల్కొండ,
బీజాపూర్, కర్ణాటక లకు కూడా విస్తరించడం లో అది
మొగలుల పరిపాలన ని 'పెరుగుట (1) విరుగుట కొరకే' రీతిగా
breaking point కి తీసుకెళ్లింది.

ఈ విస్తరణ మొగలుల కమ్యూనికేషన్ లైన్లను
మరాఠాల దాడులకి తెరిచాయి. ఈ ప్రాంతాల్లో మొగలు
కులీనులు తమకివ్వబడిన జాగీర్ల నుండి వసూళ్లు చేయడం
అసాధ్యంగా మారి చివరికి మరాఠాలతో (7) ప్రైవేటు ఒప్పందాలు
చేసుకోవాల్సి వచ్చింది. ఇది మరాఠాల శక్తి ని ప్రత్యక్షం
గా ఇనుమడింపచేసింది, మరోవైపు మొగలు కులీనుల్లో
బలహీనతను కలిగించి మొగలు సామ్రాజ్య ప్రతిష్ఠ కి
దెబ్బ గా మారింది. బహదూర్ షా ఆలం, జేబు పెద్ద
కొడుకు చెప్పినట్లు బీజాపూర్, గోల్కొండలని కొంత
భాగాన్ని ఆక్రమించి వాటితో సంబంధం కుదుర్చుకొని

బంగాళా మొత్తం కావడాన నిర్వహణ కష్టమవుతుంది

కాబట్టి కర్జన్ దీని ఎంతో పాలించేందుకు అనుకూలిస్తే

బాగుండేది.

అయితే దక్షిణ, ఇతర యుద్ధాలు మొగలు సామ్రాజ్యం పై చూపిన ప్రభావాన్ని, సుదీర్ఘకాలం వైబు ఉత్తర భారతం లో లేకపోవడం ల ప్రభావాన్ని అంతకముంది చూడకూడదు. ఫిరంగివైబు విధానాల్లో కొన్ని లోపాలు, వ్యక్తిగతమైన కొన్ని లోపాలూ ఉన్నా (ఉదాహరణ కు విపరీతమైన అనుమాన స్వభావం, సంకుచిత స్వభావం, కోపం మొ॥వి.) మొగలు సామ్రాజ్యానికి (8) ఇంకా శక్తివంతమైన సైనిక, పరిపాలనా యంత్రాంగం ఉంది. మొగలుల ఫిరంగిదళం ఇంకా యుద్ధభూమి లో తిరుగులేనిదిగానే ఉంది.

నిరంతర అరాచకత్వం, యుద్ధాలు, మరాఠాల దాడులు దక్షిణ జనాభా ని తగ్గించి ఉండొచ్చు. దక్షిణ లో వ్యవసాయం, వర్తక వాణిజ్యాలు, పరిశ్రమలు స్తంభించి ఉండొచ్చు. కాని ఉత్తర భారతం, సామ్రాజ్య హృదయం మాత్రం బలమైన(9) మొగలు పరిపాలనలో ఇంకా వెలిగి ఉంది. వర్తకం, పరిశ్రమలు విలసిల్లడమే గాక వృద్ధి చెందాయి. జిల్లా స్థాయి పరిపాలన చాలా సుస్థిర స్వభావం గల్గినది పరోక్షం గా బ్రిటిషు పరిపాలన లోకి కొనసాగింది.

రాజకీయంగా చూస్తే ఫిరంగివైబు

తప్పిదాలు, ప్రతీక ఓటములు చూసినా భారతీయుల మనసు (mind) ఆలోచనల్లో[10] ఊహల్లో మొగలు వంశం ఇంకా శక్తివంతమైన పట్టు కలిగే ఉంది.

రాజపుత్రుల[11] విషయం లో, మార్వార్ తో సంబంధాలు భగ్నమవడమన్నది విందుశాల వారి గుర్తింపుగల నేత ని దూరం చేయడం ద్వారా కించపర్చడమన్నది ఔరంగజేబు లక్ష్యం కాదు, అది కేవలం తప్పుడు అంచనా (miscalculation) ఫలితమని చెప్పవచ్చు. (X) అతడు మార్వార్ రాజ్యాన్ని ఇద్దరు ముఖ్య వారసుల మధ్య పంచుదామనుకున్నాడు, ఈ క్రమం లో మేవార్ ఇద్దర్ని దూరం చేసుకున్నాడు. అలాగే [redacted] షాజహాను ఇలాంటి విషయాల్లో మొగలు చక్రం ప్రమాదకరమైన పూర్వ ఘటన (precedent) ని నెలకొల్పుతుందని భావించడం లో అతడూ మొగలు కి దూరమయ్యాడు. మేవార్ తో సంబంధాల భగ్నం, దీర్ఘకాలం సాగిన యుద్ధం మొగలు సామ్రాజ్య నైతిక స్థితి ని దెబ్బతీశాయి. ఏదేమైనా రాజపుత్రుల కోరికలు ఉన్నత మన్సబుల మంజూరు ఇంతకుముందు లాగానే సాగాలని, వారి వతన భూముల్ని (home lands) వారికివ్వాలనీ ఉండేవి. ఔరంగజేబు మరణం తర్వాత వారి కోరికలు ఆరేళ్ల లోపు తీర్చబడ్డాయి, దాంతో మొగలు కి రాజపుత్రులు సమర్థంగా ఉండడం అంతమయ్యింది.

ఔరంగజేబు మత విధానాన్ని[12] సాంఘిక, ఆర్థిక, రాజకీయ సందర్భాన్ని బట్టి పరిశీలించాలి. కేవలం సనాతన దృక్పథం గలవాడు, ఇస్లామిక్ న్యాయ నాలుగు గోడల మధ్య ఉండాలని యోచించాడు. కాని ఈ చట్టం భారత్ కు వెలుపల తయారు చేయబడింది, అక్కడ భారత్ కు

పూర్తిగా భిన్నమైన పరిస్థితులుండేవి, ఆ స్థాయులన్నీ యథాతథం
గా భారత్ కు వర్తింపచేయడం సరికాదు. అలాగే
ముస్లిమేతర ప్రజల అభిప్రాయాల్ని / నమ్మకాల్ని గౌరవించక
పోవడం (బాలాసాంప్లు), దేవాలయాల పట్ల అలాగే
విధానం, ఇస్లామిక్ స్వామ్యబద్ధమైన జిజియా పన్ను ను
తిరిగి విధించడం వంటివేవీ ముస్లింలుల్ని తమవైపు
తిప్పుకోవడానికి గాని, ఇస్లామిక్ స్వామ్యం పై ఆధార
పడ్డ రాజ్యానికి మరింత విధేయులను సంపాదించడానికి
గాని తోడ్పడలేదు. మరోవైపు ఈ చర్యలు కొందరు
హిందువులు మొగలు రాజ్యానికి వ్యతిరేకులవడానికి
తద్వారా రాజకీయ తదితర కారణాల వల్ల మొగలు
సామ్రాజ్యం లో విభేదాలు గలవారి చేతులు బలపడడానికి
దోహదం చేశాయి.

అయితే మతం తనంతటది తానే ఒక
విషయం కాదు. ఔరంగజేబు మరణించిన తర్వాత
అనతి కాలంలోనే జిజియా రద్దు చేయబడింది, కొత్త
దేవాలయాల నిర్మాణం మీదున్న నియంత్రణాలు
సడలింపు చేయబడ్డాయి. కానీ ఏవీ కూడా
వేగంగా ప్రకోపిస్తున్న, పతనం చెందుతున్న 18 వ
శతాబ్దం లోని మొగలు సామ్రాజ్యాన్ని ప్రభావితం
చేయలేక పోయాయి.

మొత్తం మీద మొగలు సామ్రాజ్య
పతనం అన్నది ఆర్థిక, సాంఘిక, రాజకీయ,

వ్యవస్థాగత కారణాల మీద ఆధారపడింది. అప్పుడు చర్యలు విచ్ఛిన్నకర శక్తుల్ని (కొంత కాలం) నిలిపి ఉంచేందుకు తోడ్పడ్డాయి.

కాబట్టి సమాజం యొక్క నిర్మాణం లో ప్రాథమిక/మౌలిక మార్పుల్ని తేవడమన్నది అతనికి అసాధ్యమైనది. ఔరంగజేబు సింహాసనానికి వచ్చే నాటికి విచ్ఛిన్నకర సాంఘిక-ఆర్థిక శక్తులు అప్పటికే బాగా బలపడి ఉన్నాయి. నిర్మాణం లో మౌలిక మార్పులు తేవడానికి, పరస్పరం పోటీ పడుతున్న వివిధ అంశాల ని అప్పటి కాలం వర్గాన్నైనా సయోధ్యకి వచ్చేట్లు చేయడానికి కావాల్సిన ముందుచూపు ఉత్తమయోగ్యతా గుణాలు ఔరంగజేబు లో కొరవడ్డాయి.

ఈ విధంగా ఓ వైపు ఔరంగజేబు పరిస్థితుల బాధితుడు మరో వైపు తాను బాధితుడు కావడానికి దారితీసిన పరిస్థితులని సృష్టించేందుకు తోడ్పాటు సహాయం చేశాడు. (Thus, Zeb was both a victim of circumstances, and helped to create the circumstances of which he became a victim.)

# మొగలు సామ్రాజ్య పతనానికి గల కారణాలు

1679 లో ఔరంగజేబు మార్వార్ మీద యుద్ధం మొదలు పెట్టిన దగ్గర్నుంచి అతని పాలన అంతా అంతం లేని యుద్ధాలతో నిండి ప్రాణ, ఆస్తి వనరుల్ని హరించి వేసింది. ముఖ్యంగా దక్కను లో యుద్ధాలు చాలా ఖరీదైనవి, వృథా అయ్యేనవి. యుద్ధాల కోసమని జేబు అక్బరు కాలం నాటి నుంచి ఉన్న నిధులన్నీ ఊడ్చి తన కోసం దక్కను పంపమని ఆదేశించాడు. ఇలా ఒకప్పుడు ప్రపంచం లోనే అతి సంపన్న మైన మొగలు సామ్రాజ్యం జేబు మరణించేనాటికి దివాలా తీసింది.

దాంతో ప్రావిన్షియల్ ప్రభుత్వాలు ప్రజాభవనాల్ని, సరాయిలను, రోడ్లను మరమ్మత్తు చేసేందుకు నిధులు లేక వాటిని వదిలేయడంతో అవి ఉనికి లేకుండా పోయాయి. విద్యాలయాలు, నీటిపారుదల పనులు ఇతర ప్రజాసంక్షేమ ప్రయోజక పనులు నిధులు లేక ఆగిపోయాయి.

సామ్రాజ్య రాజధాని నుంచి ఔరంగజేబు కాలంలో పావు వంతు (1681-1707) దూరంగా జేబు ఉండడం లో మొత్తం రాజ్య యంత్రాంగమే గాడి తప్పింది. ప్రాంతీయ గవర్నర్లు స్వతంత్రులుగా తయారయ్యారు. ఉద్యోగిస్వామ్యం మునుపటి వలె అవినీతిమయమై మరింత అలసత్వ విధానం అవలంబించింది. సమర్థులైన నిజాయితీపరులైన గవర్నర్లు ప్రాంతీయ ఖజానాలను చక్రవర్తి కోసం ఖాళీ చేశారు. కాగా తెలివైన స్వార్థపర గవర్నర్లు రహస్యంగా సంపద కూడబెట్టుకున్నారు, వారి వారి

ప్రాంతాల పై వారి పట్టు పెంచుకుని అవకాశం చిక్కి
నకే స్వాతంత్ర్యం ప్రకటించుకునేందుకు ఎత్తులు పన్ని
నారు. చాలా ప్రావిన్సుల్లో శాంతి భద్రతలు
క్షీణించాయి, సంఘ వ్యతిరేక శక్తులు విజృంభించాయి,
అరాచకం సృష్టించాయి.

రాజకీయ అస్థిరత/ అలజడి, రవాణాల పై
భద్రత కరువవడం తో వర్తక వాణిజ్యాలు కుంటుపడ్డాయి.
దాంతో పలు ప్రాంతాల్లో ప్రజల ఆదాయ తగ్గిందువల్ల
ప్రభుత్వ మనుగడే గాక ప్రైవేటు మనుగడా నశించాయి.

దక్కను ఏ విధాలు రావడం ఆగిపోవడం
తో సైనికుల జీతాల చెల్లింపు గుండెల్లోన పైగా
(13) భారాయి పడింది. సైనికుల కోపం మిన్నంటింది.

ఈ విధంగా ఆర్థిక దివాలా, పరిపాలనా
యంత్రాంగం వైఫల్యం చెందడం, ప్రజల్లో చాలామంది
లో తీవ్ర అసంతృప్తి కలగలిసి మొఘలు సామ్రాజ్యాన్ని
లోపల్నుంచే డొల్ల చేశాయి. సామ్రాజ్య స్తంభాలుగా ఉన్న
ప్రాంతీయ గవర్నర్లు కూడా మొఘలు విధేయుల నుండి
అవకాశం చిక్కగానే విడిపోయేందుకు సిద్ధంగా ఉన్నారు.

## అనంతర మొగలుల కాలం లో పతనం

మొగలులలో నిర్దిష్టమైన వారసత్వ విధానమేదీ లేదు. బలవంతుడిదే మనుగడ అన్నది వారి వంశం లో ఆచరించబడింది. ఫలితంగా చోటు చేసుకున్న అంతర్గత యుద్ధాలు సామ్రాజ్యాన్ని కూడా దెబ్బతీశాయి.

ఔరంగజేబు మరణానంతరం అతని కొడుకు మువాజ్జామ్ తన తమ్ముళ్లు అజాం, కాం ల శవాలపై సింహాసనం 64 ఏళ్ళ వయసు లో అధిరోహించాడు. అతని వ్యక్తిత్వం తన తండ్రి స్వీయ పక్షపాతాలవల్ల సుదీర్ఘ జైలు కాలం లో బాగా దెబ్బతిన్నది. అతడు అసమర్థ పాలకుడు కాబట్టే "షా-ఇ-బేఖబర్" అన్న పేరొచ్చింది. అతని నాయకత్వ పాలన లో మొత్తం రాజపుతానా అంతా మొగలు నియంత్రణ నుంచి చేయి దాటిపోయింది. 1710 లో పంజాబు లో తొలి స్వతంత్ర సిక్కు రాజ్యం అవతరించింది.

బహదూర్ షా (మువాజ్జామ్) వారసులందరూ బలహీనులే. ఔరంగజేబు కాలం లోనే మొదలైన సామ్రాజ్య పతనాన్ని నియంత్రించే శక్తివంతమైన వ్యక్తిత్వం గాని వనరులు గాని వారికెవరికీ లేవు. బహదూర్ షా మరణానంతరం అత్యంత నాశనమైన అంతర్యుద్ధాలు వారసత్వ పోరాటాలపై జరిగాయి. సయ్యద్ సోదరులు కింగ్ మేకర్లు గా ఎదిగి మొగలు చక్రవర్తి ని కీలు బొమ్మని చేశారు. 1657-58, 1707-8, 1712 లలో జరిగిన వారసత్వ యుద్ధాలు మొగలు ఇంపీరియల్ కుటుంబం యొక్క సర్వనాశనాన్ని పదిలంగా చేశాయి. మొగలు రాజ రక్తం గల వారెవరయినా ఇంకా బతికున్నారంటే అది ఇతరులు వారి ద్వారా

సొంత రాజకీయ ప్రయోజనాల్ని పొందడానికి వారిని వాడుకోదలచడం వల్లనే.

కింగ్ మేకర్లు గా సయ్యిద్ సోదరులు ఎనిమిదేళ్ల లో నలుగురు చక్రవర్తుల్ని (జహాందర్ షా, ఫరూక్ సియార్, రఫీ ఉద్ దరజత్, రఫీ ఉద్ దౌలా) మార్చారు. ఆ తర్వాత వచ్చిన మహమ్మద్ షా (రంగీలా) మరణించేనాటికి మొగలు 'సామ్రాజ్యం' ఢిల్లీనగరం దాటి పరిసర ప్రాంతాలకే పరిమితమైంది. మహమ్మద్ షా కింగ్ మేకర్ల నుంచి విముక్తి పొందడానికి భారీ మూల్యం చెల్లించాడు. ఈ కాలం లో తోడ్పడినందుకు బెంగాలు లో అలీవర్ది ఖాన్, అవధ్ లో సాదత్ అలీ ఖాన్, దక్కను లో నిజాం ఉల్ ముల్క్ లు స్వాతంత్ర్యం ప్రకటించుకున్నారు. బీహారు, ఒరిస్సా, సింధ్, కాశ్మీరు లు సైతం మొగలు అధికారాన్ని తోసిరాజన్నాయి. జాట్లు, రోహిల్లాలు సామ్రాజ్యహృదయ భాగం లో తమ స్వతంత్ర రాజ్యాల్ని నెలకొల్పాయి.

1738-39 లో నాదిర్షా ఢిల్లీ ని దోచుకోవడం ద్వారా మొత్తం ప్రపంచానికంతా మొగలు సామ్రాజ్య పతనాన్ని చాటి చెప్పాడు. అయితే నాదిర్షా, అహ్మద్ షా అబ్దాలీ ల దండయాత్రలు గాని యూరోపియన్ల చొరబాట్లు గాని (→ భారత రాజకీయాల్లోకి) మొగలు సామ్రాజ్య పతనానికి కారణాలు కావు, వీటిని మొగలు సామ్రాజ్య పతనం యొక్క ఫలితాలు గానే చూడాల్సి ఉంటుందని కొందరు చరిత్రకారుల అభిప్రాయం.

Satish Chandra

# Origin of the Bhakti Movement

దక్షిణ భారతదేశంలో భక్తి ఉద్యమం బౌద్ధుల, జైనుల కాఠిన్యానికి (rigidities) వ్యతిరేకంగా మొదలైన ప్రతిచర్య.

14, 15 శతాబ్దాలలో ఉత్తర భారతదేశంలో బయలుదేరిన ప్రజాబాహుళ్య భక్తి ఉద్యమం ఈ దక్షిణాది భ.ఉ. ప్రభావం చేతనే జరిగిందని అంటారు. సాంస్కృతికంగా ఉత్తర, దక్షిణ భారతాల మధ్య పరస్పర వినిమయం సాధారణమే అయినా దక్షిణాది భక్తి ఉద్యమానికి ఉత్తరాది భ.ఉ. మధ్య దాదాపు 5-6 శతాబ్దాల తేడా ఉంది. దీనికి రెండు ప్రాంతాల్లోని భిన్న పరిస్థితులే కారణం.

(1)

ఉత్తర భారతంలో వివిధ జాతుల వారు రాజపుత్రుల పేర విశాలాధికారం సంపాదించారు. బ్రాహ్మణులు వారికి "క్షత్రియ" హోదా నిచ్చారు. ఇందుకు ప్రతిగా రాజపుత్రులు బ్రాహ్మణులకు దేవాలయాల నిర్వహణకై భూదానాలు, ధనం ఇచ్చేవారు. రాజపురోహితులు గా కూడా వారిని గౌరవించారు.

ఈ రాజపుత్ర - బ్రాహ్మణ కూటమి వల్ల రాజపుత్రులు వర్ణవ్యవస్థ రక్షకులు గా మారారు. ఈ సాంఘిక క్రమం, బ్రాహ్మణ ఆధిపత్యాన్ని సవాలు చేసే ఏ తత్త్వం అయినా శక్తివంతులైన బ్రాహ్మణుల [illegible] [illegible]కి గురి కావాల్సి వచ్చేది. భక్తి ఉద్యమ గ్రంథాలు అనేకం సంస్కృతంలో వెలుస్తున్నా, నాథపంథీ [illegible]త్రాది సంప్రదాయేతర (heterodox mvts) ఉద్యమాలు వెలసినా భ.ఉ. మాత్రం విస్తార

"Q" Evaluate the impact of the Sufi and Bhakti Movements on vernacular languages and life and thought of the common people.

Ans: భక్తి, సూఫీ ఉద్యమాలు గానాన్ని భగవదారాధనా మాధ్యమం గా ప్రాచుర్యం గావించాయి. భక్తి ఉద్యమం కొందరం మేరం లో ఉత్సవాలల్ని సాదరి సంకీర్తన గానాన్ని - "కీర్తనల్ని" ఆదరించింది. దాంతో పాటే సమూహాలుగా కూడా పాటలు పాడేసి ప్రాంతీయ భాషలకు ప్రాచుర్యం కల్పించింది. భక్తి ఉద్యమ సాహిత్యమంతా ప్రాంతీయ భాషల్లోనే వెలువడి వివిధ ప్రాంతీయ భాషా సాహిత్యాన్ని సుసంపన్నం చేసింది.

భక్తి ఉద్యమం తమిళం లో ఆళ్వార్ల నయనార్ల రచనలు 'నాలాయిరదివ్యప్రబంధం', పన్నెండు 'తిరుమురై' లు వెలువరించింది. ఈ రచనలు పవిత్ర సాహిత్య హోదా పొంది ఆలయ, వ్యక్తిగత పూజల్లో భాగమయ్యాయి. వైష్ణవ భక్తి సాహిత్యం తమిళం లో పలు సమూహాల సాహిత్యాలను తెచ్చింది, పౌరాణిక శైలి ని తమిళం లో చూపింది. శైవ భక్తి సాహిత్యం తమిళం లో నూతన ఆధ్యాత్మికత్వం నిండిన పద్యాల్ని సిత్తార్ లనే పద్యకర్తల ద్వారా అందించింది. సిత్తార్ల ఆధ్యాత్మిక పాటలు తమిళ ప్రజల్లో ఎంతో ప్రాచుర్యం పొందాయి.

ఇండో-ఆర్యన్ భాషల్లో భక్తి సాహిత్యం మొదట మరాఠీ ని ప్రభావితం చేసింది. 13 వ శతాబ్దం లో జ్ఞానేశ్వర భగవద్గీత కి మరాఠీ వ్యాఖ్యానం 'భావార్థదీపిక' (జ్ఞానేశ్వరి) రాశారు. ఇది లయబద్ధమైన గద్యం. ఆ తర్వాత నామదేవుడు, తుకారాము 'అభంగాల' ద్వారా మరాఠీ సాహిత్యాభివృద్ధి చేశారు.

జ్ఞానేశ్వరుని బోధనలు క్లిష్టమైనవి కాగా ఏకనాథునివి సామాన్య జనులకు సైతం అర్థమయ్యేంత సరళమైనవి. "Jnanadeva was proud of Marathi. Prouder still was Ekanatha." ఆయన పదకొండో స్కంధం పై మరాఠీ వ్యాఖ్యానం రాశాడు. 'భావార్థ రామాయణం' ద్వారా మరాఠీ లో రామకథ అందించాడు. ఏకనాథుని అభంగాలు సంస్కృతంలోని ఉత్తమ శైలి విలువల్ని వారి భాషా మరాఠీ లోకి అందించాయి.

తుకారాం ప్రజల కవి. ప్రజల మాటలు, సామెతలు నిండిన మరాఠీ పద్యాల్ని అతడు అందించాడు. రామదాసు 'దాసబోధ' అనేది పలు రచనలు, ఉపన్యాసాల సంకలన గ్రంథం. మరాఠీ సాహిత్య గుర్తింపు చాలా వరకు భక్తి ఉద్యమ ఫలితమనే చెప్పవచ్చు.

బెంగాలీ భాష లో చండీదాసు (14 వ శతాబ్దం) 'కృష్ణకీర్తనలు' భావపూర్ణ లోతుల్ని సృష్టి ఉన్నాయి/ ~~అందించాయి~~.

చైతన్యుడి చుట్టూ బెంగాలీ లో ఎన్నో పద్యాలు, జీవితచరిత్రలు, గాథలు, నాటకాలు రూపొందాయి. ఇలా బెంగాలీ సాహిత్యం లో ప్రత్యేకం వైవిధ్యాన్ని భక్తిసాహిత్యం పండించింది. మూడు శతాబ్దాల పాటు కృష్ణుడు, చైతన్యుడు బెంగాలీ సాహిత్యానికి ప్రధాన ప్రేరణ గా నిలిచారు. 17 వ శతాబ్దం లో ప్రముఖ బెంగాలీ పద్యకర్త లెందరో వెలిశారు, గోవింద దాస్ వారిలో ముఖ్యుడు.

హిందీ లో భక్తి సాహిత్యాన్ని రామానందుడే ఆరంభించినా అది స్వల్పమే. అతని శిష్యుడు కబీరు "దోహా" ల ఖ్యాతి గా ప్రకాశవంతం. ఈ దోహాలు సాంప్రదాయ నియమాల కు విశ్వవ్యవహార గుణాన్ని అధికంగా కలిగి ఉన్నాయి. అనువాదాలలో అవి మంచి ప్రతీకాత్మకత నిండినవై (symbolism) అసాధారణ గాఢ గేయ శక్తి ని ప్రదర్శిస్తాయి. కొందరి వాదాల ఈ చిన్న పద్యాలు సులభంగా గుర్తుంచుకోడానికి అనువుగా ఉంటాయి.

ఉత్తర భారత బైబిలు గా పేరొందిన "రామ చరిత మానస" హిందీ సాహిత్యానికి భక్తి ఉద్యమకారుడు తులసీదాసు అందించిన కలికితురాయి. సూరదాస్ పాటలను "సూర సాగర" గా సంకలనం చేశారు. ఇవి సున్నిత భక్తి ప్రదర్శిస్తాయి.

మీరాబాయి రాజస్థానీ బ్రజ్ భాష లో పలు పాటలు వెలువరించింది.

ద్రావిడ భాషల్లో కన్నడ లింగాయతుల ద్వారా ప్రభావితమైంది. వీరు కన్నడ సాహిత్యం లో "వచనా"న్ని ప్రవేశ పెట్టారు. రెండు శతాబ్దాల పాటు లయబద్ధమైన, భక్తి ప్రేరణాత్మక వచనాల్ని గద్యం లో వీరు వెలువరించారు. లింగాయతులు పద్య సంకలనాల్ని, వారి గురువుల్ని పొగడుతూ hagiographic సాహిత్యాన్ని వీరు సృష్టించారు. 16 వ శతాబ్దం లో వైష్ణవ భక్తి సాహిత్యం సంస్కృతం లోని మహాగ్రంథాల్ని (classics) కన్నడం లో అనువదించింది. దాస కవులు కన్నడం లో హృదయాల్ని కదిలించే పాటలు రాశారు. పురంధర, కనక దాసులు సమస్త వర్గాలు, కులాల వారికీ సంబంధించిన కన్నడ సాహిత్యాన్ని సృష్టించారు.

తెలుగు సాహిత్యం లో భక్తి కవులు జనప్రియ సాహిత్యాన్ని అందించారు. అన్నమయ్య 'సంకీర్తనలు' రామదాసు గా పేరొందిన కంచెర్ల గోపన్న 'భజనలు' త్యాగయ్య 'కృతులు' బహుళ జనాదరణ పొందాయి. మాండలిక వాడుక లో సరళ గ్రాంథికం లో ప్రజల నుడికారాన్ని నింపుకొన్న రచనలు.

అస్సామి, గుజరాతీ, మరాఠీ, ఒరియా భాషలని భక్తి ఉద్యమం ప్రభావితం చేసింది. శంకరదేవ రామాయణం, భాగవత పురాణం లాటి అన్ని భాగాల్ని అస్సామి లోకి అనువదించాడు.

భట్టదేవ అస్సామీ గద్యానికి ఒక రూపం ఇవ్వడంలో కీలకపాత్ర పోషించాడు. ఇతడు గీత, భాగవత పురాణాల్ని స్పష్టమైన గద్యంగా అనువదించాడు. గుజరాతీ లో భక్తి పద్యాలు, పాటలకు నరసింహ మెహతా చాలా వరకూ తోడ్పడ్డాడు. కాశ్మీరీ లో లల్లేశ్వరి పద్యాలు ఆధ్యాత్మికమైనవి. చైతన్యుడు ఒరిస్సా లో చూపిన ప్రభావం వల్ల ఒరియా లో వైష్ణవభక్తి సాహిత్యం వెల్లివిరిసింది.

సూఫీలు ఉర్దూ సాహిత్యాభివృద్ధి కి ఎంతో తోడ్పడ్డారు. ఘజల్ పద్యాలు లౌకిక, మార్మిక, ఆధ్యాత్మిక వ్యాఖ్యానాలకు అనువైనవి. అవి ప్రేమ పద్యాలు గా శృంగార పద్యాలుగా చెప్పించుకుంటూ సూఫీల మార్మికత్వం వాటి మూలాన ఉంటుంది. సయ్యద్ గేసు దరాజ్ "మిరాజ్-ఉల్-ఆషికీన్" అనే మార్మిక ఉర్దూ గ్రంథాన్ని రాశాడు. షేక్ నూరుద్దీన్ కాశ్మీరీ లో వందల ద్విపదల్ని రాశాడు. అందులో అతని మార్మిక, సూఫీ మనస్సు కన్పిస్తుంది.

భక్తి ఉద్యమం ప్రధానంగా వివిధ ప్రాంతీయ భాషల్లోని సాహిత్యాల్లో పండితులకే ఆస్వాదయోగ్యం గా ఉండే "మార్గ" పద్ధతి కి బదులు గా పామరులు కూడా విని ఆస్వాదించగల "దేశి" పద్ధతి ని ఆదరించింది. అగ్రవర్ణాల సాహిత్యంలో భాషా పరంగా వస్తు పరంగా సంస్కృతీకరణ అధికం. కాని భక్త కవులు భాష, రూపం సామాన్యుల కు దగ్గరగా ఉంచారు. వాడుక భాష, సామెతల్ని

నీళ్ళలో మొదటే పదప్రయోగాలు, వాటిలో ప్రబంధం లో ఉన్న బంధాలు వీరి సాహిత్యంలో కనిపిస్తాయి.

## ప్రజల జీవితం, ఆలోచనల పై భక్తి, సూఫీ ఉద్యమాల ప్రభావం:

భక్తి ఉద్యమం ప్రజల జీవితాన్ని, ఆలోచనల్ని గాఢంగా ప్రభావితం చేసింది. కులాల వెలివేతలో మార్పులు తెచ్చింది, కుటుంబ జీవితాన్ని పవిత్రమని చెప్పింది, స్త్రీ హోదా ని కొంత మెరుగు పరిచింది, మానవత్వాన్ని, సమతాన్ని ప్రోత్సహించింది; కర్మకాండలు ఆడంబర ఉత్సవాల్ని, తీర్థయాత్రలు, ఉపవాసాలు, గ్రంథాల అధ్యయనం మొ|| వాటి ప్రాధాన్యాన్ని తగ్గించి భగవంతుణ్ని విశ్వాసంతో ప్రేమతో ఆరాధించడానికి ఆధిక్యత కల్పించింది. బహుదేవతారాధన చెడుగల్ని అంత వరకైనా పరిమితం చేసింది. ముఖ్యంగా నిర్గుణ భక్తి కల్ట వారు ఇందుకు ఎంతో తోడ్పడ్డారు. జాతి ఉన్నతంగా ఆలోచించేందుకు, వ్యవహరించేందుకూ తోడ్పడింది. మత విషయాలలో ఉన్నత - నిమ్న కులాల మధ్య అంటరానితనాల మధ్య ఉన్న విభేదాల్ని కొద్దిగా నైనా తగ్గించ గలిగింది.

సమాజం లో ఉన్న చెడులకి వ్యతిరేకంగా తమ గళం విప్పించడం ద్వారా భక్తి ఉద్యమ కారులు నిరంతర మత సంస్కరణలకి బాటలు పరిచారు.

భక్తి ఉద్యమకారులు తమ అనుచరులు తప్పనిసరిగా
సామాజిక చెడుగుల్ని వ్యతిరేకించాలన్నారు.
వారి హేతుబద్ధ నైతిక బోధనలు, స్త్రీ శిశుహత్యల్ని
సతి ఆచారాన్ని తీవ్రంగా ఖండించడం,
కుల వ్యవస్థ మీద శక్తివంతమైన విమర్శలు, మొ॥ వి
సామాన్య ప్రజానీకానికి వీటి లోని చెడుగుల్ని వీటి
దుష్ప్రభావాల్ని అర్థం చేసుకోడానికి తోడ్పడ్డాయి.
కబీరు వంటి బోధకులు మత్తుపదార్థాల వాడకాన్ని
నిరసించారు. గురుగోవింద సింగ్ పొగ తాగడాన్ని
నిషేధించాడు. భక్తి ఉద్యమకారులు జనింపజేసిన
స్ఫూర్తితో సాంఘిక శక్తులు మరాఠాల స్వరాజ్య గొప్ప
హిందూ రాజ్యంగా అవతరించడం లో ముఖ్య
రాజకీయ కారకాలు గా తోడ్పడ్డాయని కొందరు
చరిత్రకారులంటారు.

దేశం లోని వివిధ భాగాల్లో ప్రజా
జీవనస్రవంతి లో ముస్లిం సంస్కృతి వ్యాపించడానికి
సూఫీ ఉద్యమం తోడ్పడింది. హిందువుల్లో క్రింది
కులాల వాళ్ళు (కొందరు ముఖ్యంగా బెంగాల్లో) ఇస్లామిక్
సమానత్వం, సోదర భావం మొ॥ వాటిచే
ప్రభావితులై మతం మార్చుకున్నారు. సూఫీలు
సహనం [వివిధ మతాల మధ్య] ప్రాధాన్యతని
నొక్కి చెప్పారు. వారు బోధించిన విలువలు,
కాస్మోపాలిటన్ దృక్పథం [illegible], ఏకాంతాల
భావాల్ని బద్దలు చేసేందుకు దోహదం చేసింది.
దేశం లోని భిన్న సాంస్కృతిక వర్గాల మధ్య

సాంఘికం గా భావసారూప్యం గా అన్ని స్థాయిల్లోనూ
సంఘీభావాన్ని పెంపొందించింది. సూఫీలు ప్రజలకు కర్తవ్య
నైతిక, ఆధ్యాత్మిక ఆదర్శాలను అందించారు. సూఫీలు
భ.ఉ.కా. కలిసి మధ్యయుగ భారతీయ సమాజ సాంస్కృతిక
సమైక్యతాన్ని కాపాడ్డం లో కీలకపాత్ర పోషించారు.

# Mughal Architecture

క్రీ.శ. 13 వ శతాబ్దం లోనే ఆర్క్యుయేట్ (arcuate) పద్ధతి (– ఖాళీలను కప్పడం, డోమ్ లు లో, ప్రవేశాల్లో ఆర్చీలు నిండుగా నిర్మించడం) ప్రవేశ పెట్టబడడం లో ఒక కొత్త వాస్తు శైలి కి పునాది వేయబడింది. మొగలులు ఈ సంప్రదాయాన్ని కొనసాగించి హిందువుల మొండితి పద్ధతి - ట్రాబియేట్ (trabeate) ని ఆర్క్యుయేట్ లో సమ్మేళనం చేశారు. మొత్తం మీద ఈ సమ్మేళనం ఫలితంగా ఒక విలక్షణ మైన మొగలుల వాస్తు శైలి రూపొందింది.

మొగలు వాస్తుశైలి దాని పరిణత రూపాన్ని అక్బరు కాలం లోనే పొందిందనేది నిజమే, అయినా మొగలు వాస్తుశైలి basic / ప్రాథమిక సూత్రాలు కొన్ని బాబరు, హుమాయూన్ లచే అందించబడ్డాయి.

__బాబరు__ తన సెంట్రల్ ఆసియా ప్రాంతం (ప్రవహిస్తున్న నీటి తో కూడినవి) ఉద్యానవనాలు (terraced gardens) పద్ధతి లో మన దేశం లో పలు కట్టించాడు. వాస్తు లో ఇతడికి regularity (క్రమం), symmetry (సౌష్ఠవం) అంటే మక్కువ.

__హుమాయూన్__ స్వయంగా

కట్టించిన నిర్మాణాలు అంత గొప్పవి కాకపోయినా అక్బరు కాలం లో కట్టించిన అతని సమాధి పేర్కొనదగినది. నిజానికి ఇది మొగలు వాస్తుశైలి పరిణామం లో ఒక మైలురాయి.

ఈ సమాధి డిజైనింగ్ లో దాని అమలు లో పర్షియన్
సంస్కృతి ప్రభావం సుస్పష్టం. హుమాయూన్ పర్షియన్ వాస్తు
కళాకారులు ఢిల్లీ వచ్చి వారి శైలిప్రాల్య పద్ధతుల్లో ఎందరిని
వినియోగించారు. అందువల్ల "ఇది ఒక పర్షియన్ ఆకృతి
పెర్సీబ్రౌన్ భారతీయ ప్రదర్శన గా చూడవచ్చిన ప్రతినిధి" అన్నాడు.
హుమాయూన్ సమాధి ఉద్యానవనం లో ఉండిన, ఎత్తైన
ఆర్కేడెడ్[2] (arcaded) ఇసుకరాయి[3] ప్లాట్‌ఫాం పై కట్టబడిన
ఒక లాగి సమాధి. ఈ సమాధి అష్టభుజి[4] ప్లాను కలిగి, ఎత్తైన
డబుల్[5] డోము లో ఉండి ఉంది. [ఈ డబుల్ డోము
మన దేశం లో ప్రవేశించడానికి ముందు పశ్చిమ ఆసియా
లో వాడుక లో ఉంది.]

సూర్ వంశీయుల వాస్తుకళ లో
రెండు దశలున్నాయి.

మొదటి దశ లో సమాధుల గ్రూపు
ఇది చెప్పదగింది. ఈ గ్రూపులో షేర్షా సమాధి
అనవసరం (ససరాం) గొప్ప వాస్తుకళాఖండం. చునార్
ఇసుకరాయి లో కట్టబడిన ఈ సమాధి సరస్సు
మధ్యలో ఉండడాన దాని భారీతనం రెట్టింపైనట్లు,
ఎదురుతున్నట్లు (భ్రాంతి కలిగిస్తుందని పెర్సీబ్రౌన్
అన్నాడు.

అష్టభుజి ఆకృతి గల ఈ భారీ భవంతి
ఎత్తైన చతురస్ర ప్లాట్‌ఫాం పై ఉండడాన భవంతి
ఎత్తును భారీతనాన్ని పెంచుతుంది, ప్లాట్‌ఫాం
మూలల్లోని కియోస్కులు (kiosks) దాని

ప్రధాన భవనంలో లాగా కలుపుతున్నాయి. పలు దశల్లో ఎగిసే డోము ద్వారా విరస ప్రభావం సాధించారు. డోము మీద గోడ లాగా కప్పబడింది, ఈ గోడ పై కంగూరాల శ్రేణి అలంకరిస్తుంది. భారీ డోము తామర శిఖరం finiale లా కప్పబడింది. శిల్ప సమృద్ధి లాటి పలు అంశాలు కొద్ది మార్పులతో తాజ్ మహల్ కి తీసుకెళ్లడం గమనించవచ్చు. కాని తాజ్ మహల్ తేలిగ్గా గాలిలో తేలుతున్నట్లు భ్రమ కలిగిస్తే శిల్ప సమృద్ధి బలం, భారీతనం (వీటి వాస్తుకళలో ప్రధాన గుణాలుగా భావిస్తారు) శిల్ప ప్రాశస్త్యాన్ని వెల్లడించేలా ప్రదర్శిస్తుంది.

రెండవ దశ లోనివి సూరీల ఢిల్లీ కట్టడాలు. వీటిలో కిలాయె కుహ్నా మసీదు ముఖ్యమైంది. ఇందులో గమనించాల్సింది ఆర్చిల ఆకారం – ఆర్చి మొనలు వెళ్లే వంపు లో కొద్దిపాటి చదునుదనం (flatness) కల్పిస్తుంది. ఇది మొగలుల నాలుగు-కేంద్రాల "ట్యూడర్" (Tudor) ఆర్చి వృద్ధి చెందడానికి ముందున్న దాని చివరి దశని సూచిస్తుంది.

అక్బరు కాలం లో ఇండో-ఇస్లామిక్ వాస్తుకళా సంప్రదాయాల చక్కటి సమ్మేళనాన్ని చూడవచ్చు. అక్బరు నాటి వాస్తుశైలి లో దేశీయ పద్ధతుల ప్రాబల్యం, ఇతర దేశాల అనుభవాన్ని ఎంపిక చేసి వాడుకోవడం కన్పిస్తుంది. అక్బరు పాలన లో ఎదిగిన వాస్తుకళా అంశాలు

1) భవనాలు ప్రధానం గా ఎర్ర ఇసుకరాయి తో కట్టబడ్డాయి.
2) ట్రాబియేటెడ్ నిర్మాణాన్ని విరివిగా వాడడం.
3) ఆర్చీలను ప్రధానం గా నిర్మాణ రూపం లో గాక అలంకరణ రూపం లో వాడడం.
4) డోమ్ లు 'లోడి' పద్ధతి లో ఉండడం; కొన్నింటిల్లో డొల్ల (hollow) గా కట్టబడేది; కాని సాంకేతికం గా ఎప్పుడూ వాస్తవమైన డబుల్ పద్ధతి లో కట్టబడలేదు.
5) స్తంభాల షాఫ్టులు (shafts) బహుముఖాలు గలవి. ~~ఈ~~ స్తంభాల క్యాపిటల్స్ తప్పనిసరి గా ఊతమిచ్చే బ్రాకెట్ల రూపం లో ఉండేవి.
6) చెక్కడాలు (boldly carved), లోపలి భాగం లో కాంతివంతమైన రంగులు పూసే పద్ధతులలో నింపిన అంతర్నిర్మిత ఇన్‌లేయిడ్ (inlaid patterns) పద్ధతులు ప్రధాన అలంకరణాలు గా ఉండేవి.

Trabeate → an architectural form in which the main openings are made by beams supported on pillars.

## సమాధి లో పర్షియన్ అంశాలు

- నిజమైన డబుల్ డోము, కాని అంతగా పరిణతి చెందలేదు.
- లోపలి గదుల ఏర్పాటు — ఒక ఎన్క్లోజర్ కి బదులుగా ప్రత్యేక గదులు కారిడార్ లో ఉండి అవి మార్గాల (passages) ద్వారా కలుపబడ్డాయి.

## భారతీయ అంశాలు

- మొత్తం కట్టడం నియమిత ఉద్యానవనం లో ఉంచబడింది.
- గుజరాతీ వాస్తుశైలి లక్షణమైన సన్నని మినరెట్స్ జోడు ని ఉపయోగిస్తున్నాయి.
- పొగసైన కియోస్కులు రాజస్థానీ వాస్తుశైలి లక్షణం.

అక్బరు కట్టడాల్ని రెండు వర్గాలు గా చూడవచ్చు.

మొదటి వర్గం - ఆగ్రా, అలహాబాదు, లాహోరు లలోని కట్టడాలు

రెండవ వర్గం - ఫతేపూర్ సిక్రి కట్టడాలు.

ఆగ్రా కోట భారీ battlements లాంటి crenalated[2] గోడలతో ఉంది. దాని ద్వారాలు రెండు అష్టభుజి[3] టవర్ల ను (ఎర్ర ఇసుకరాయి తో చేసినవి) కలిగి ఉన్నాయి. ఈ టవర్లు ఒకదానితో ఒకటి కలుపబడ్డాయి[4]. ఈ ఆగ్రా కోట పద్ధతి (pattern) పై లాహోరు, అజ్మీరు, అలహాబాదు కోటల్లో కూడా పాటించారు. షాజహాను ఢిల్లీ లో కట్టించిన ఎర్రకోట కూడా ఈ ఆగ్రా కోట పద్ధతి లోనే కట్టబడింది.

ఈ ఆగ్రా కోట లో ఎర్రరాతి లో చక్కని బెంగాలి గుజరాతి వాస్తుశైలుల్లో అక్బరు పలు కట్టడాలు (దాదాపు 500) కట్టించాడని అబుల్ ఫజల్ చెప్పాడు. నేడు మిగిలినవి చాలా తక్కువ.

నేడు మిగిలిన అక్బరి మహల్, జహాంగిరి మహల్ ల భాగాల ద్వారా వాటి వాస్తుశైలి తెలుసుకోవచ్చు. ఈ భవనాల పైకప్పు చదును (flat) గా ఉంది, అధికం గా చెక్కిన (carved) స్తంభాల తో పైకప్పు కి ఊతమివ్వబడింది. భారీ ఎర్ర ఇసుక రాయి తో ఉన్న బ్రాకెట్లు[1], బాల్కనీలు[2]; అలంకారంగా చెక్కిన వెరళ్లు[3] మొ॥ వి ఈ భవనాల్లో కనిపించే రాజస్థానీ వాస్తుశైలి అంశాలు.

ఫతేపూర్ సిక్రి లోని భవనసముదాయం కొండ పైన కృత్రిమ సరస్సు పక్కన కట్టబడింది. క్రిందున్న మైదానం లో నగరం చుట్టూ గోడ కట్టబడింది. మైదానం లో భవనాలు నేడు చాలా వరకు మాయమయ్యాయి. ఇది గమనించిన పెర్సీబ్రౌన్ కొండ మీది భవనసముదాయాన్ని నగరమనుకోవడానికి నగరం కి ఉండాల్సిన క్రమ వ్యవస్థ/ప్రణాళిక లేదని వ్యాఖ్యానించాడు. చరిత్రకారుడు సతీష్ చంద్ర సిక్రి భవన సముదాయానికి కూడా ఒక ప్రణాళిక ఉందని నిరూపించారు.

సిక్రీ కట్టడాల్ని తోరణీక, మెహ్రాబ్ కట్టడాలుగా (ఆర్చుల సహితంగా)
గమనించవచ్చు. trabeate arcuate

తోరణీక కట్టడాలు సాధారణంగా
ట్రాబియేటెడ్ (trabeate) స్వభావాన్ని కలిగి ఉంటాయి.
చక్రవర్తి హిందూ భార్యల భవంతి లో ఒక
మరుగుదొడ్లకి చుట్టూ అనేక గదులు (సంప్రదాయ హిందూ
భారతీయ శిల్ప వాస్తుశైలి) ఉన్నాయి. చెక్కలు, కాలమలు,
కాపిటల్స్ అన్నీ సంప్రదాయ దేవాలయ స్తంభాల నుంచి
అరువు తెచ్చుకున్నారు. పైభాగం ప్రత్యేకంగా ఉంది.

హరేం కాంప్లెక్స్ లో బీర్బల్ పేరు మీద
తప్పుగా చెలామణీ అవుతున్న ఒక రెండంతస్తుల భవనం
గొప్ప రెసిడెన్షియల్ నిర్మాణం కలదని ; నిర్మాణం - అలంకరణల
మధ్య చక్కటి సమతౌల్యం ఉందని N.K. సరస్వతి అన్నారు.
అక్బరు తల్లి భవనం లో గొప్ప కుడ్య చిత్రాలు చిత్రించారు.
రాజస్త్రీలు గాలి లో విహరించేందుకు 'పంచ మహల్'
ఉద్దేశించబడింది.

సిక్రీ లో భవనాలు మరింతగా ప్రయోగాత్మక
శైలి లో కన్పిస్తాయి. దివాన్-ఇ-ఖాస్ వీటిలో ముఖ్యమైంది.
ఇందులో ఒకే హాలు ఉంది. వృత్తాకార రాతి ప్లాట్‌ఫాం కు
ఊతమిచ్చేలా పెద్ద భారీ పిల్లర్ స్తంభం ఉంది. ఈ
మధ్య ప్లాట్‌ఫాం నుండి రాతి బ్రిడ్జిలు ప్రతీ మూలకి
కొనసాగి వేలాడే గాలరీలలో కలుస్తాయి. ఇలా మధ్య
ప్లాట్‌ఫాం ను మధ్య పిల్లర్ అనేక పొరలు, బ్రాకెట్ల లో
ఊతమివ్వడం అనేది గుజరాతీ దేవాలయ వాస్తుశైలి నుండి
గ్రహించారు.

## షాజహాన్ కాలంలో మొఘలు వాస్తుకళ

పరాకాష్ఠ నందుకున్నది. ఇతని కాలం లో ఎర్రరాయి స్థానాన్ని పాలరాయి ఆక్రమించింది. ఈ కట్టడ పదార్థం లోని మార్పు పలు శైలీ పరమైన మార్పులకు కారణమైంది.

1) అక్బరు కాలం నాటి గుండ్రని ఆర్చి స్థానం లో వంపులున్న ఆర్చి వచ్చింది. సాధారణం గా తొమ్మిది వంపులు ఉండేవి.

అక్బరు ఆర్చి



షాజహాను ఆర్చి




2) వంపులున్న ఆర్చిల కు పాలరాయి ఆర్కేడులు (arcades) ఉండడం సాధారణ లక్షణమైంది.
arcade = a range of roofed arches.

3) డోము బాగా ఉబ్బుగా (bulbous form) తయారైంది. stilted మెడ గల డోములు ఏర్పడ్డాయి. డబుల్ డోములు చాలా సాధారణమయ్యాయి.

4) రంగుల రాళ్ళతోటి ఇన్లేయిడ్ పద్ధతులు ప్రధాన అలంకరణా విధానమయ్యాయి.

5) ఇనలే అలంకరణ లో కొత్త విధానం గా "పీత్రదురా" వృద్ధి చెందింది. ఇందులో లాపిస్ లజూలి, కార్నేలియన్

జాస్పర్, టోపజ్ వంటి విలువైన రాళ్ళ ని పొదిగిన పుష్ప-పత్ర డిజైనుల్లో పాలరాయి లో పొదుగుతారు.

భారతీయ వాస్తుకళల్లోకి అలవాటికమైన తాజ్ మహల్ లో మునుపటి మొగలులు స్వీకరించిన అన్ని వాస్తుకళా రూపాల్ని మెప్పించే రీతి లో ఒక్కచోటికి చేర్చడం తద్వారా వాటిని వారి సొంతం చేసుకోవడం గమనించవచ్చు. ఇందులో

- సమాధి ని ప్రవహించే నీటి కాలువలు, ఫౌంటెయిన్ లతో కూడిన నియమిత (formal) ఉద్యానవనం లో ఉంచడం.
- ప్రధాన కట్టడాన్ని ఎత్తైన ప్లాట్‌ఫాం మీద కట్టడం తద్వారా జోరు కు చక్కని స్థైర్యమైన ఇవ్వడం, కట్టడానికి solidity ఇవ్వడం.
- ప్రవేశం వద్ద అర్ధ డోమ్ పోర్టల్ ఉండటం.

తాజ్ ప్రధాన అందం దాని భారీ డోము నాలుగు సన్నని మినరెట్లు, ఈ మినరెట్లు ప్లాట్‌ఫాం ను ప్రధాన కట్టడం తో సంధానిస్తాయి. (linking)

అలంకరణాలు సౌందర్యాన్నంత తక్కువ గా ఉండేలా చూశారు— సున్నితమైన పాలరాయి తెరలు, పీత్రదుర ఇనలే, కియోస్కులు (ఛత్రీలు) వంటివి వాడారు.

షాజహాన్ కాలం లో మసీదుల నిర్మాణం కూడా పరాకాష్ఠ కు చేరింది. ఆగ్రా లోని మోతీ మసీదు తాజ్ మాదిరి గా పూర్తిగా పాలరాతి తో కట్టబడింది. ఢిల్లీ లోని జామా మసీదు ఎర్రఇసుకరాతి తో కట్టబడింది. భారీ ద్వారం, పొడవైన సన్నని మినరెట్లు, అనేక డోములు ఈ జామా మసీదు లక్షణాలు.

"Q." Explain the principal features of architecture during Akbar's rule. What changes were made in them by Shah Jahan?

* పిత్ర దురా వంటి చాలా అలంకరణల్లో సున్నితమైన నైపుణ్యం ప్రదర్శించే అలంకరణాలు – బంగారు, విలువైన మొదలైన వాటిని చెక్కడం చేశారు.

చూ. పే. [illegible] p. 278 - read pink underlines

* నూర్జహాన్ తండ్రి మిర్జా ఘియాస్ బేగ్ సమాధి – ఇతిమదుద్దౌలా సమాధి అక్బరు మరియు జహంగీరు, షాజహానుల కి వాస్తుశైలి లో మార్పు ని (బలిమయం, సౌకుమార్యం) సూచిస్తుంది. అక్బరు భవనాల robustness నుంచి షాజహాను కాలంలోని సున్నిత సుకుమార వాస్తుశైలి కి మార్పుపొందడం ఈ నిర్మాణ భావన లో గమనించవచ్చు.

* ఆగ్రాకోట లోని మోతీ మసీదు లో షాజహాన్ ప్రత్యామ్నాయ పథకం లో ప్రయోగం చేశాడు – తెరచిన ఆర్కేడెడ్ ప్రార్థనా మందిరం (open arcaded) పైగా, ఈ మసీదు లో ఎత్తైన మినారెట్ల ని వదిలేసి వాటి స్థానం లో "ఛత్రీ" లను ప్రార్థనా మందిరం నాలుగు మూలల్లో ఉంచాడు. ఇందులో మూడు ఉబ్బుగల (bulbous) డోమ్‌లు ఉన్నాయి. మొత్తం నిర్మాణమంతా (నల్ల మార్బుల్ కాలిగ్రఫీ లో ఉండిన) తెల్ల పాలరాయి లోనే నిర్మించబడింది, ఇది ఈ నిర్మాణ elegance ని సాక్షి చెబుతుంది.

1-11-05
Diwali

# The Rajput policy of Mughals

బాబరు (1526-30): బాబరు ~~ఉత్తర~~ భారతదేశంపై దండెత్తు కాలం నాటికి ఉత్తర భారతదేశంలో మేవార్, మార్వార్, ~~ఆ~~ చందేరి, రణథంబోర్, అజ్మీర్, జైసల్మేర్, అంబర్, బికనీర్ మొదలైనవి ముఖ్యమైన రాజపుత్ర రాజ్యాలు. వాటిలో మేవార్ ను పాలించే రాణా సంగ్రామసింహుడు (సంగ్రామసింహుని రాణా సంగా అనికూడ అంటారు) అత్యంత శక్తివంతమైన వాడు.

రాణా సంగా అంతకుముందు బాబరును ఆహ్వానం ఇచ్చి దండెత్తమని ఆహ్వానించినా, మొదటి పానిపట్టు యుద్ధంలో బాబరుతో చేతులు కలుప లేదు. బాబరును ఢిల్లీ నుండి ~~ఆక్రమణ~~ తరిమివేసి ఢిల్లీలో ~~..~~ పెత్తనం వహించ ఆశించిన రాజపుత్ర రాణా సంగా నాయకత్వంలో బాబరుతో తలపడగా, బాబరు వారిని కాన్వా యుద్ధం (1527)లో ఓడించాడు. తరువాత బాబర్ మాళ్వాలోని ~~చ~~ చందేరి పై దాడిచేసి మేదిని రాయుని ఓడించి చందేరిని ఆక్రమించాడు.

ఈ విధంగా బాబరు రాజపుత్రుల యెడల hostile శత్రు వైఖరి కలిగియుండెను. ~~అణచి వేత~~ యుద్ధము, విజయము, విలీనము (annexation) అనునవి రాజపుత్రుల పట్ల బాబరు విధానములో ముఖ్యపాత్ర వహించినవి.

హుమాయూన్ (1530-40 & 1555-56): గుజరాత్ పాలకుడైన బహదూర్ షా మేవార్ పై దండెత్తి చిత్తోర్ ను ముట్టడించగా చిత్తోర్ రాణి కర్ణావతి (రాణా సంగా భార్య),

హుమాయూన్ సాయం అర్థించింది. కాని హుమాయూన్ సానుకూలంగా స్పందించలేదు. తద్వారా రాజపుత్రులతో స్నేహ సంబంధాలు నెలకొల్పే సువర్ణ అవకాశాన్ని జారవిడిచాడు. ఈ విధంగా హుమాయూన్ ~~[illegible]~~ రాజపుత్ర విధానంలో ~~inaction~~ (క్రియాశూన్యత (inaction), isolation (ఏకాకిత్వ) వహించాడు.

అక్బరు (1556 to 1605): అక్బర్ తన తండ్రి, తాత వలెగాక, సుదీర్ఘకాలం రాజ్యపాలన చేశాడు. అతను గొప్ప సామ్రాజ్యవాది. అతను తన సామ్రాజ్యవిస్తరణ వల్ల, తన అధికారం సుస్థిరం చేసుకోవడానికి విశాలమైన ఆసక్తి కనబరిచాడు. అతడు అసాధారణమైన తెలివితేటలు, దౌత్యనీతి కలిగినవాడు. తన లక్ష్యాలను నెరవేర్చాలంటే, భారతదేశంలో అందరికంటే ధైర్యసాహసాలు, స్వాభిమానం, స్వామిభక్తి, దేశభక్తి కలిగిన రాజపుత్రుల ~~[illegible]~~ సహకారము తప్పనిసరి అని అక్బరు గుర్తించాడు. ఈ కారణంగా అక్బరు యొక్క రాజపుత్ర విధానం తన ముందు మొగల్ చక్రవర్తుల విధానాలకి పూర్తిగా ~~[illegible]~~ భిన్నంగా ఉంది. ~~రాజపుత్రుల మద్దతు, సహకారాన్ని పొందడానికి [illegible] పద్ధతుల అవలంబించాడు.~~

అక్బరు రాజపుత్ర విధాన పరిణామాన్ని మూడు దశలుగా చెప్పవచ్చు.

మొదటిదశ: క్రీ.శ. 1572 వరకు ఉన్న ఈ దశలో అక్బరుతో రాజపుత్రులు విధేయులైన మిత్రులుగా చూడబడ్డారు. తమ రాజ్యం, దాని పరిసర ప్రాంతాలలో వీరు అక్బరుకు సైనిక

స్నానం చేయాలి. ఉదాహరణకు రాజా భార్మల్, భగవాన్‌దాస్‌లు ఉజ్జైన్ జలాశయాల్లో అక్బరుతో స్నానం చేశారు. 

రెండవ దశ: క్రీ.శ. 1572లో జరిగిన గుజరాత్ దండయాత్రలో రెండవ దశ మొదలైంది. ఈ దశలో విధేయులైన మిత్రులుగా ఉండటమే గాక రాజపుత్రులు మొగలు సామ్రాజ్య సైనికశక్తిగా ఎదిగారు. ఉదాహరణకు అక్బరు మాన్‌సింగ్‌ను షేర్‌ఖాన్ ఫులాడీని పట్టుకోవడానికి నియమించాడు. ఈ దశలో రాజపుత్ర సైనికులను కూడా అధికంగా చేర్చుకోబడటం, వారికి మొదటిసారిగా నిర్దిష్ట జీతాలు నిర్ణయించబడటం జరిగింది.

మూడవ దశ: ఈ దశలో అక్బరు రాజపుత్ర విధానం పూర్తిగా వృద్ధిచెందింది. 'విధేయులైన మిత్రులు', సైనిక శక్తి అయిన రాజపుత్రులు స్వతహాగా రాజ్య భాగస్వాములు, రాజప్రముఖుల్లో పదవులకు అర్హులుగా ఉంటూనే కాకుండా వ్యక్తిగతంగా తమ ప్రాబల్యాన్ని పెంచుకొన్నారు. ఉదాహరణకు క్రీ.శ. 1583లో భగవంత్ సింగ్ లాహోర్ గవర్నరుగా నియమించబడ్డాడు.

అక్బరు రాజపుత్రుల మద్దతు, సహకారాన్ని పొందడానికి పలు పద్ధతులు అనుసరించాడు.

1. అక్బరు రాజపుత్ర విధానంలో వివాహ సంబంధాలతో దృక్పథంతో కూడిన పరమత సహనం పాటించబడింది. దండయాత్రలలో తన సైనికులను హిందువులపై దుర్మార్గం చేయరాదని ఆజ్ఞాపించాడు. హిందువులు చేసే తీర్థయాత్రల సుంకాన్ని రద్దు చేశాడు. 1564లో జిజియా పన్నును కూడా రద్దు చేశాడు. యుద్ధంలో పట్టుబడిన సైనికులను వారిని బలవంతంగా మతం మార్చే పద్ధతికి స్వస్తి చెప్పాడు.

దీనితో కూడిన ఈ చర్యలవల్ల హిందూ ప్రజలలో అక్బరు రాజపుత్రులలో అక్బరుపట్ల సహృద్భావం ఏర్పడింది.

2. అక్బరు రాజపుత్రులతో స్నేహపూర్వకమైన వివాహ సంబంధాలు నెరపాడు. ఉదాహరణకు అంబర్, జైసల్మీర్, బికనీర్ల పాలకులైన రాజపుత్రులు అక్బరుకు తమ కుమార్తెలనిచ్చి వివాహం జరిపించారు.

అయితే ఈ విధంగా ముస్లిం పాలకులకి, హిందూ రాజులు తమ కుమార్తెలనిచ్చి వివాహం జరపడం అప్పట్లో అసాధారణం ఏమీ కాదు. 14, 15 శతాబ్దాల్లో కూడ దేశంలోని అనేక ప్రాంతాల్లో ఇట్టి వివాహాలు జరిగాయి. మార్వార్ ను పాలించిన శక్తివంతుడైన మాల్ దేవ్ (Mal Deo) తన కుమార్తెను గుజరాత్ పాలకుడైన సుల్తాన్ మహమూద్ కు ఇచ్చి వివాహంచేశాడు. ఇలానే తన మరో కుమార్తెను ఇస్లామ్ షా కు ఇచ్చి పెళ్లిచేశాడు. విజయనగర రాజైన బుక్క దేవరాయలు తన కుమార్తెను బహమనీ రాజైన ఫిరోజ్ షా కి ఇచ్చి కళ్యాణం చేశాడు. అయితే గతంలో లాగా ఇలాంటి మతాంతర వివాహాలు రెండు కుటుంబాల మధ్య స్థిర సంబంధాలను సాధించలేదు. కానీ ఈ విషయంలో అక్బరు విభిన్న విధానాన్ని అనుసరించాడు. అతడు తన హిందూ భార్యలకు మతవిషయాలలో పూర్తి స్వేచ్ఛనిచ్చాడు. వారి తండ్రులకు, బంధువులకు ప్రభువర్గంలో (Nobility) గౌరవనీయమైన హోదాలను కల్పించాడు. అక్బరు తన భార్యలవైపు కుటుంబాలతో స్థిర సంబంధాలు కొనసాగించడం అతని రాజపుత్ర విధానంలో ప్రత్యేకత.

అజీజ్ ఖాన్ కుకా (kuka) లు ఉన్నారు. 1583 లో
భగవంత్ సింగ్ లాహోర్ గవర్నర్‌గా ఉన్నారు. 1585-86
ప్రాంతంలో రాజపుత్రులు లాహోర్, కాబూల్, ఆగ్రా,
అజ్మీర్‌లకు సంయుక్త గవర్నర్లుగా నియమించారు.
వారిని ఫౌజుదార్లుగా, కోటల కమాండర్లుగా నియమించారు.
జోధ్‌పూర్, రాయ్ దుర్గాలను రెవెన్యూగా కేటాయించబడింది.
రాజా బీర్బల్ అక్బరుకు సన్నిహితుడు.

1585-86 లో సుబాలకు పాలనావిధానం ప్రవేశపెట్టారు!
వాటికి అమీరు, దివాన్, బక్షి అనే అధికారుల
నియామకంలో రాజపుత్రులకు అధిక సంఖ్యలో ప్రవేశం
కల్పించబడింది. అక్బర్ రాజపుత్రులకు వతన్ జాగీర్లను
ఇచ్చారు. ఇవి బదిలీల (transfers) నుండి మినహాయించబడినవి.

6. ధిక్కారాన్ని చూపిన రాజపుత్రులను తన నియంత్రణలో
ఉంచుకొనుటకు వాడిన ఉపాయం అస్త్రంగా అక్బర్ బల
ప్రయోగాన్ని చూపాడు. మార్వార్ కు చెందిన రాథోడ్‌లు,
మేవార్‌కు చెందిన శిశోదియాలు అక్బరు ఆధిపత్యాన్ని
తిరస్కరించగా, వారిపై బల ప్రయోగం చేశాడు. మేవార్‌కు
చెందిన రాణా ప్రతాప్ వద్దకు మొఘల్ ఆధిపత్యాన్ని
అంగీకరించవలసిందని పెక్కుసార్లు దౌత్యం నిర్వహించి
విఫలమైన తర్వాత అతనిపై యుద్ధం ప్రకటించి
హల్దీఘాటీ యుద్ధంలో అతనిని ఓడించాడు. కాని రాణా ప్రతాప్
సమీప కొండ ప్రాంతాలకు పారిపోయి దీర్ఘకాలం గెరిల్లా యుద్ధం
కొనసాగించాడు.

7. అక్బరు రాజపుత్రులలో కలహాలు రగిల్చేందుకు ఎన్నడూ ప్రయత్నించలేదు. అయితే వారిలో ఉన్న స్పర్ధల్ని గమనించి వాటిని తనకనుకూలంగా వాడుకున్నాడు.

అక్బరు రాజపుత్ర విధానం యొక్క అంచనా: అక్బరు యొక్క రాజపుత్ర విధానం ~~[illegible]~~ చాలా లోతైన ప్రభావాన్ని చూపింది. అది మొగల్ సామ్రాజ్యానికి, రాజపుత్రులకు లబ్ధి చేకూర్చింది.

1. రాజపుత్రులతో అక్బరు నెరపిన సత్సంబంధాల వల్ల భారతదేశంలో అత్యంత ధైర్యశాలురైన యోధుల సేవలు మొగల్ సామ్రాజ్యానికి దక్కాయి. రాజపుత్రుల చెక్కుచెదరని విధేయత మొగల్ సామ్రాజ్య విస్తరణ, సుస్థిరతలకు ఎంతో ముఖ్యమైన ఆధారం అయింది.

2. మొగల్ చక్రవర్తులతో సత్సంబంధాలు రాజపుత్రులకు కూడ ఎంతో ~~[illegible]~~ సహాయపడింది. రాజస్థానులో యెడారి ప్రాంతాన్ని ప్రసాదించింది. ~~[illegible]~~ లేని వ్యవసాయ గడ్డనుంచి వచ్చేటువంటి ఆదాయం తక్కువగా ఉండటం దూర ప్రాంతాల్లో వారికి మొగల్ సామ్రాజ్యానికి సేవ అందించే వీలు కల్పించింది. వారు అంతరంగిక స్వాతంత్ర్యం అనుభవించారు. మరల స్వాతంత్ర్యం పొంది వారి ఉత్సవాలు జరుపుకునేవారు. ఆచార, సంప్రదాయాలను పాటించేవారు. సాధారణంగా వారి వారసత్వ హక్కులు గౌరవింపబడ్డాయి.

3. రాజపుత్రులకు రాజస్థానంలోను, ప్రావిన్సుల లోను ముఖ్యమైన పదవులను, హోదాలను ఇవ్వటంవల్ల పాలనాయంత్రాంగ పునాది విస్తరించబడటమే కాక, పరిపాలనా

జహాంగీర్ (1605-1627):

జహాంగీర్, అక్బరు రాజపుత్ర విధానాన్ని కొనసాగించాడు.

1. మార్వార్, జైసల్మీర్, బికనీర్ మొదలైన రాజపుత్ర రాజులతో జహాంగీర్ అక్బరు వలె వివాహ సంబంధాలు నెరపాడు. ఈ రాజకుటుంబాలకు అత్యున్నత గౌరవాన్ని ఇచ్చాడు.

2. మేవార్ లో ఎప్పటినుండో రగులుతున్న వివాదానికి తెరదించడం జహాంగీర్ సాధించిన అద్భుత ఘనకార్యము. రాణా ప్రతాప్ వారసుడైన అతని కొడుకు అమర్ సింగ్ పై జహాంగీర్ మూడు సార్లు దండెత్తినాడు కాని అంత ప్రయోజనం చేకూరలేదు. చివరకు యువరాజు ఖుర్రం నేతృత్వంలో పెద్దసైన్యం మేవార్ పై దాడిచేసింది. మొగల్ సైన్యం వత్తిడి, ప్రజలు మేవారను వదలి వెళ్ళిపోవటం, పంటలు వ్యవసాయం నాశనం కావటం మొదలైనవి అమర్ సింగ్ పై ప్రభావం చూపాయి. అతడు జహాంగీర్ తో సంధి కుదుర్చుకున్నాడు. జహాంగీర్, రాణా ప్రతిష్ఠను మన్నిస్తూ రాణా విషయంలో ఆస్థానానికి వ్యక్తిగతంగా హాజరవ్వటం, సామ్రాజ్యానికి సేవచేయటంలలో మినహాయింపునిచ్చాడు. అతని కుమారుడు కరణ సింగ్ కు 5000 మున్సబుదారి ర్యాంకు ఇవ్వబడింది. మొగల్స్ కు మేవారకు మధ్య యాభై సంవత్సరాల కాలం నుండి నెలకొనివున్న శత్రుత్వం విజయవంతంగా అంతం చేయబడింది. ఈ విధంగా అక్బర్ చేపట్టిన కార్యాన్ని జహాంగీర్ విజయవంతంగా పూర్తిచేశాడు. ఇది రాజకీయంగా జహాంగీర్ కు, వ్యక్తిగతంగా ఖుర్రంకు గొప్ప విజయం.

జహంగీరు పాలనాకాలంలో మేవార్, మార్వార్, అంబర్ మరియు బికనీర్ పాలకులైన రాజపుత్రులకు కొంటే 5000, ఆ పై హోదాగల మన్సబులను ఇచ్చారు. అక్బరు కాలంలో కన్నా జహంగీర్ కాలంలో రాజపుత్రుల రాజ్యాలకు ఎక్కువ హోదాగల మన్సబులు ఉన్నాయి. రాజపుత్రులు ప్రధానంగా కిలాదార్లు లేదా ఫౌజుదార్లుగా నియమించబడ్డారు.

షాజహాను (1628-1658): షాజహాన్ తన తాత, తండ్రుల రాజపుత్ర విధానాన్ని మొత్తం మీద కొనసాగించి, రాజపుత్రులతో సౌహార్ద్ర సంబంధాలు కొనసాగించాడు. ఇది అతని స్థానాన్ని సుస్థిరం చేసుకోవడంలో తోడ్పడింది.

1. జహంగీర్ పాలన చివరి దశలో షాజహాన్ తిరుగుబాటు చేసినప్పుడు మేవార్ పాలకుడైన కరణ్ సింగ్ షాజహానకు ఆశ్రయం కల్పించాడు.

2. షాజహాన్ పాలనాకాలంలో రాజపుత్ర సేనలు మొఘలు ప్రాంతాలైన దక్కన్, మధ్య ఆసియాలోని బాల్ఖ్, కాందహార్ లలో ప్రముఖమైన సేవలందించారు.

కానీ షాజహాన్ రాజపుత్ర విధానం కొన్ని విషయాలలో అతని ముందరి వారి విధానాలతో విభేదించింది.

a. షాజహాన్ ఏ ఒక రాజపుత్రుడిని గవర్నరుగా నియమించలేదు.

b. ప్రధాన రాజపుత్ర కుటుంబాలతో అతను వివాహ సంబంధాలు నెరపలేదు. అతని తల్లి

ఒక రాజపుత్ర వనిత అనేది గమనార్హం. మొగలులతో
రాజపుత్రులతో సంబంధాలు స్థిరత్వం పొందిన
కాలమంతా, ముఖ్య రాజపుత్ర కుటుంబాలతో వివాహ
సంబంధాల అవసరం లేదని భావించి ఉండవచ్చు.

జోధ్‌పూర్, అంబర్ ల ప్రముఖ రాజపుత్ర
కుటుంబ పెద్దలకు షాజహాన్ ఉన్నత
గౌరవ మర్యాదలను ఇచ్చాడు. రాజా జస్వంత్ సింగ్ (మార్వార్)
రాజా జై సింగ్‌లకు షాజహాన్ ఎంతో ఆదరణ చూపాడు.

ఔరంగజేబు (1658-1707) : ప్రారంభంలో ఔరంగజేబు
రాజపుత్రులతో సత్సంబంధాలకు చాలా విలువ నిచ్చాడు. వారి
మద్దతు కాపాడుకొనేందుకు అతడు వారిపట్ల రాజనీతిని,
యుక్తిగల వైఖరిని కూడా ప్రదర్శించాడు. మేవార్ రాణా
మద్దతు ~~~~ పొందేందుకు అతని మన్సబుని 5000/5000 నుంచి
6000/6000 కు పెంచాడు. జస్వంత్ సింగ్ (మార్వార్) తనతో
ధర్మత్ వద్ద యుద్ధం చేసినా, షా షుజా కి వ్యతిరేకంగా చేసిన
దండయాత్రలో ఔరంగజేబు పక్షం నుంచి విరమించినా,
దారా ను తన భూ ~~~~ భూభాగాలకు ఆహ్వానించినా,
ఔరంగజేబు అతనిని మన్నించి అతనికి అతని పాత మన్సబ్‌ని
పునరుద్ధరించాడు. పైగా అతనిని గుజరాత్ గవర్నర్ గా కూడా
నియమించాడు. ~~జై సింగ్ ఇతను~~ 7000/7000 మన్సబ్‌దార్
హోదా కలిగిన జైసింగ్ ~~తన~~ 1667 లో తను మరణించే
వరకు ఔరంగజేబుకు ఆప్తునిగా, నమ్మకస్తునిగా
మెలిగాడు.

1678లో జస్వంత్ సింగ్ మరణంతో అతనికి పుత్ర
వారసులెవ్వరూ లేకపోవటంతో 'గద్దె' వారసత్వ సమస్య

తలెత్తింది. వారసత్వ సమస్య తలెత్తినప్పుడు ఆ రాష్ట్రాన్ని అంతర్భద్రతల రక్షణకై మొగలుల పరిపాలన క్రిందికి బలవంతంగా తెచ్చి, తర్వాత ఎంపిక చేసిన వారసునికి దానిని ఇచ్చివేయడమనేది సంప్రదాయం మొగలుల్లో అప్పటికే నెలకొని ఉంది. దీననుసరించి ఔరంగజేబు ఆ మార్వార్ రాజ్యాన్ని తన పాలన క్రిందికి తెచ్చాడు. జస్వంత్ సింగ్ మొగల్ చక్రవర్తికి భారీ మొత్తంలో బకాయి చెల్లించవలసి ఉండటం, జస్వంత్ సింగ్ కు బాహాటంగా ఇష్టుడైన కొన్ని ప్రాంతాల రాజపుత్రులు అతని మరణం తర్వాత ప్రమాదాల్ని లేవనెత్తి కల్లోలం సృష్టించి ఉపద్రవాలు చేసే అవకాశం ఉండటం, ఔరంగజేబు మార్వార్ ను ఆక్రమించుటకు కారణాలయ్యాయి. ఔరంగజేబు జస్వంత్ సింగ్ బంధువు పోయాక రెండు పరగణాలను మాత్రం ఇచ్చాడు. జోధ్‌పూర్ రాథోరల వతన్ (homeland) కావటం వలన ఇవ్వటానికి రాణి హాది నిరసన తెల్పిన ప్రయోజనం లేకపోయింది. పైగా మార్వార్ లో మొగల్ సైనికులు నిధుల కోసం వెదకటం, కొత్త దేవాలయాల్ని కూల్చటం, ఆక్రమించటం వంటివి చేశారు. అంటే మొగలులు ఆక్రమణదారులుగా వ్యవహరించారు. మార్వార్ ను శత్రుభూమిని చూసినట్లు చూశారు. ఏ కోణంలో చూసినా ఇది అన్యాయపూరితమైనదే!

జస్వంత్ సింగ్ మరణానంతరం అతని ఇద్దరు భార్యలకు ఇద్దరు కొడుకులు పుట్టారు. వారి వారసత్వ

మాతృకల ప్రాబల్యం లభించింది. కాని ఔరంగజేబు మార్వార్ గద్దెను (అతడు) జస్వంత్ సింగ్ అన్న అమర్ సింగ్ మనుమడు ఇంద్రసింగ్‌కు 36 లక్షల రూపాయల వారసత్వ రుసుం తీసుకొని ఇచ్చివేశాడు.

కాని దుర్గాదాస్ నేతృత్వంలో రాథోర్ సర్దారులు ~~[illegible]~~ ఇంద్రసింగ్‌ను అంగీకరించక, అజిత్ సింగ్ (జస్వంత్ సింగ్ కొడుకు) ను మద్దతు తెల్పారు. దీనికి కోపగించిన ఔరంగజేబు జస్వంత్‌సింగ్ భార్యలు కొడుకులను, తల్లులతో సహా అరెస్టు చేయించి, ఢిల్లీ నందు ఉంచాడు. అయితే రాథోర్‌లు ఒక రాకుమారునితో (అజిత్ సింగ్) [illegible] తప్పించుకొని, అతనికి జోధ్‌పూర్‌లో కిరీట ధారణ చేశారు. ఔరంగజేబు మార్వార్‌పై దండెత్తి జోధ్‌పూర్‌ను ఆక్రమించాడు. దుర్గాదాస్ అజిత్‌సింగ్‌తో సహా మేవార్ పారిపోగా రాణా వారికి ఆశ్రయం కల్పించాడు. ఈ దశలో ఔరంగజేబు మార్వార్ పాలకునిగా అజిత్‌సింగ్‌ను అంగీకరించి ఉండవలసింది. పైగా ఔరంగజేబు మార్వార్ పాలకునిగా ప్రకటించిన ఇంద్రసింగ్ ప్రజాభిమానం చూరగొనలేకపోయాడు; రాథోర్‌లు కూడా అతనికి వ్యతిరేకం. కాని ఔరంగజేబు దుర్గాదాస్‌కు ఆశ్రయం ఇచ్చినందుకు మేవార్‌పై ~~యుద్ధం ప్రకటించాడు~~. దండెత్తాడు. ఈ యుద్ధం దీర్ఘకాలం కొనసాగి చివరకు ఔరంగజేబు మార్వార్‌తో ఒక ఒప్పందం కుదుర్చుకోవలసి వచ్చింది.

~~[illegible]~~ మార్వార్, మేవాడ్‌లపై మొగలుల యుద్ధ

~~ఏదై~~ ఏదైమైనా ~~మే~~ మార్వార్, మేవార్ ల విషయంలో 5.1

ఔరంగజేబు ఉల్లంఘించిన షరతులు/విశ్వాస ఘాతుకం అన్నది మొత్తం

రాజపుత్రులందరితో సమష్టి ద్రోహంగా తలచారు.

అంబర్, బికనీర్, బుంది మరియు కోట పాలకులు

మొగల్ సైన్యంలో 1679 తర్వాత కూడా తమ సేవలను

కొనసాగించి, సామ్రాజ్యం నుండి మన్సబులను

పొందుతూనే ఉన్నారు. తమకు మార్వార్, మేవార్లతో

ఔరంగజేబు సుదీర్ఘ యుద్ధాలు చేసినంత మాత్రాన

అక్బరు యొక్క రాజపుత్ర సత్సంబంధ విధానానికి,

ఔరంగజేబు స్వస్తి చెప్పాడనడం సరికాదని రుజువవుతోంది.

నవీన పరిశోధనలు చూపినట్లు, ఔరంగజేబు దక్షిణంలో

మొగల్ సామ్రాజ్యాన్ని విస్తరింపదలచిన ప్రాంతాల్లో

(ఉత్తర భారతదేశంలో సామ్రాజ్యం కాస్త స్థిరపడటంతో)

అతనికి రాజపుత్రుల కన్నా మరాఠాల అవసరం ఎక్కువ

తోచింది.

కొందరు పండితులు, రాథోర్ ~~రా~~ రాజపుత్రులు ఎక్కువ

సంఖ్యలో 1681-1706 మధ్య దక్షిణంలో ఉన్నప్పటికీ,

మరాఠాలతో జరిగిన యుద్ధ ఫలితాలు వేరుగా ఉండేందుకు

అవకాశం ~~ఉం~~ ఉండవచ్చు అనే విషయంపై సందేహం

వెలిబుచ్చారు. ఏదేమైనా, ఉన్నత మన్సబుల మంజూరి

నిరంతరాయంగానే సాగాలని, వారి వతన భూములు

(~~home~~ homelands) ~~వా~~ వారికివ్వాలని కోరికలు, ఔరంగజేబు

మరణం తర్వాత ఆరు సంవత్సరాలలోనే తీర్చబడ్డాయి.

~~ఆ~~ ఆ ~~త~~ విన్నలు జరిగిన మొగల్ సామ్రాజ్య విచ్ఛిన్నతలో

రాజపుత్రులు కొంతవరకు పాత్ర నిర్వహించారు.

అనుభవించటం, తన శక్తులను ప్రతిబింబించటం ప్రతి జీవి యొక్క గమ్యం. ఇది సాధించినప్పుడు జీవి అన్ని బాధలనుండి, అన్ని పరిమితులనుండి అన్ని బంధములనుండి అన్ని ~~[illegible]~~ తప్పనిసరైన ప్రవృత్తులు, బాధ్యతలనుండి విముక్తుడౌతాడు.

శంకరాచార్య వేదాంత తత్వాన్ననుసరించి నిర్గుణ బ్రహ్మ (Brahman) కోసం తపస్సు చేయటం ద్వారా ఆత్మసాక్షాత్కారం కలుగుతుంది. ఆత్మకు, పరమాత్మకు ఉండే సంబంధం అప్పుడే బోధపడుతుంది. ~~[illegible]~~ ఆత్మకు, పరమాత్మకు భేదం లేదని శంకరాచార్యుడు చెప్పాడు. ఆత్మ నిర్గుణ బ్రహ్మతో సమానమైనదని ఆయన నమ్మకం. ఈ ఆత్మ, పరమాత్మల ఏక రూపత నుంచి తెలియనందువల్ల మానవులు నానా యాతనలు పడుతున్నారని ఆయన వాదన. అవిద్యవల్ల, భ్రమలవల్ల మానవుడు ఏకరూపం ఉన్నచోట్ల అనేకరూపాలను చూస్తున్నాడని శంకర ఉవాచ. భగవంతుడు ఒక్కడే అయినా మానవులు వెయ్యి భగవంతుని రూపాలను దర్శించడానికి కూడా ఇదే కారణమని ఆయన విశ్వాసం. విద్య లేదా జ్ఞానమార్గం ద్వారా మానవుడు తనను ఆవహించి ఉన్న భ్రమలనుండి బయటపడతాడని, భగవంతునికి, తనకూ ఉన్న ఏకరూపతను గ్రహిస్తాడని శంకరాచార్యుడు చెప్తున్నాడు. మోక్షం అంటే ఇదేనని, ఉపనిషత్తులు ప్రవచించిన "తత్వమ్-అసి" అర్థం ఇదేనని శంకరాచార్యుడు వివరించాడు. ఈ ఆత్మసాక్షాత్కారమనేది మరణానంతరం మాత్రమే సిద్ధించనవసరం లేదు. ఈ జీవితకాలంలో కూడా ఆత్మసాక్షాత్కారం

సాధించవచ్చునని, ఉత్పత్తర్య బంధాలు విచ్ఛిన్నమయ్యేవరకు శరీరం ఉంటుందని ఆయన పేర్కొన్నారు. ఇలా జీవన్ముక్తుడైన వ్యక్తి బ్రహ్మలో మాత్రం ఐక్యమౌతాడని, మళ్లీ అతనికి జన్మ, జరా బాధలుండవని శంకరుడు పేర్కొన్నారు.

మోక్షానికి భక్తి, కర్మ మార్గమే సరిపోదని, ఏకాగ్ర చిత్తంతో భగవంతుని ధ్యానించడం ద్వారా జ్ఞాన మార్గంలో మోక్షాన్ని సాధించవచ్చునని శంకరాచార్యుడు పేర్కొన్నారు. వివేకం ద్వారాను, వైరాగ్యం ద్వారాను జ్ఞాన మార్గం పాటించి మోక్ష ద్వారం ప్రవేశించవచ్చునని శంకరాచార్యుడు ప్రవచించారు. అయితే వ్యక్తిగత భగవంతుడు అవసరమైన స్థాయిలో ఉన్నవారు, తమతమ నచ్చిన భగవంతుని రూపానికి భక్తి, శ్రద్ధలతో ప్రార్థనలు జరుపవచ్చును ఆయన అంగీకరించారు. అందువల్ల జ్ఞాన మార్గంలో పయనించే మానసిక స్థాయి ఉన్నవారికి, భక్తి మార్గంలో పయనించే సామాన్యులకు కూడా అద్వైతమార్గంలో స్థానం ఉంది. భక్తి మార్గంలో పయనించే వారి కోసం ఆయన శివుణ్ణి, విష్ణువుని స్తుతించే అనేక స్తోత్రాలను రచించారు. అయితే ఈ స్తోత్రాలలోనైనా జ్ఞానమార్గం ద్వారా నిర్గుణబ్రహ్మను అందుకోవాలన్న సందేశాన్ని ఇచ్చారు. ఈ రకంగా శంకరాచార్యుడు మోక్షసాధనకు జ్ఞానమార్గాన్ని సూచిస్తూనే, భక్తిమార్గానికి, కర్మమార్గానికి కూడ అవకాశం కల్పించారు. అయితే చివరి రెండు మార్గాలు జ్ఞాన మార్గానికి మెట్లుగా మాత్రమే ఉపయోగపడాలని ఆయన అభిలాష. ఆయన జ్ఞానము యొక్క ~~ఉన్నత~~ ప్రాముఖ్యతను స్థాపించి సందేహవాదాన్ని అనుమానవాదాన్ని, భౌతికవాదాన్ని ఖండించారు.

శంకరాచార్య తత్వవిచారానికి మూలము ఉపనిషత్తులే అయినప్పటికీ, బౌద్ధమతము నుండి కూడ కొన్ని భావాలను ఆయన స్వేచ్ఛగా స్వీకరించాడు. శంకరాచార్యుడు బోధించిన నిర్గుణబ్రహ్మకు, మహాయాన బౌద్ధమతం ~~బోధించిన~~ ప్రవచించిన శూన్యత కూడా నిర్వాణానికి పెద్ద తేడా లేదు. మహాయాన బౌద్ధంలో సంఘాలు (శాఖలు) ఎన్ని. నిర్వాణాలు కూడ ఎన్నోవి. ఉనికి గలది ఒకే ఒక్కటి. అదే శూన్యత. ప్రపంచంలో అంతర్లీనంగా ఉండే శూన్యతే నిర్వాణం యొక్క సారము. అందువల్లనే శంకరాచార్యుని విమర్శకులు అతనిని ప్రచ్ఛన్న బుద్ధునిగా వర్ణించుటానికి వెనుకాడలేదు.

మతపరంగా చూచినపుడు శంకరాచార్యుని ప్రవచనములు కొంత కొరత అనిపించవచ్చునుగాని, తత్వవిచార పరంగా చూచినపుడు అవి పరిపూర్ణమని చెప్పవచ్చును. శంకరాచార్యుని ప్రవచనాలు ప్రామాణ్యాలుగా ఉండటంలోనే అతని అద్భుత ప్రతిభ వెల్లడౌతుంది. తన యుక్తి[1] వాదనా పటిమ ద్వారాను, కొన్ని[2] పదబంధాలను వ్యాఖ్యాత్మకంగా వివరించటం ద్వారాను, ఉపనిషత్తులలోని పైకి పరస్పర విరుద్ధంగా కన్పించే అంశాలను బోధనలలో ఒకటి సమన్వయం పరచగలిగాడు. అతని తత్వవిచారము సరళమైనది కాకపోయినా, ప్రపంచానికి కూడా మహోన్నతమైన హిందువుల ~~ప్ర~~ ప్రామాణికమైన తత్వవిచారంగా పరిగణింపబడుచున్నది. నేటికీ తత్వవేత్తలలో ~~[illegible]~~ గొప్ప గౌరవ ప్రదమైన

స్థానాన్ని పాశ్చాత్య విమర్శకులు శంకరాచార్యులకి ఇస్తారు.

వారినబట్టి ఆధ్యాత్మిక ప్రగతికి ఉత్తమ ప్రవర్తన, నైతిక జీవనం అత్యంతావశ్యకమని గౌతమ బుద్ధుడిలాగే శంకరాచార్యుడు విశ్వసించాడు. నైతిక జీవనం గడపలేని వ్యక్తి ఆధ్యాత్మికంగా అభివృద్ధి సాధించలేడని శంకరాచార్యుడు పేర్కొన్నాడు. ఆయన సాధనాలు(శాస్త్రాలకి) సరైన జ్ఞానంతోపాటు సన్మార్గం, ఋజువర్తన అత్యంతావశ్యకాలని ఆయన స్పష్టంచేశాడు. కోర్కెల వల్లనే దుర్గుణాలు అవకాశం ఏర్పడుతున్నాయని, అందువల్ల కోర్కెలను (చెడ్డం!) పూర్తిగా విసర్జించాలని ఆయన ఉద్బోధించాడు.

శంకరాచార్యుడు ప్రవచించిన జ్ఞాన మార్గము చాలాకొద్దిమంది మాత్రమే అర్థం చేసుకోగలిగారు. అది ప్రజాబాహుళ్యాన్ని ప్రభావితం చేయలేకపోయింది. శంకరాచార్యుని వ్యాఖ్యానాలు తరువాతి కాలంలో వచ్చిన కొందరు భాష్యకారులు అంగీకరించలేదు. వారిలో రామానుజులు ముఖ్యుడు.

## Gist

1) ఆది జీవితం రచనలు
2) ఉపని, బ్రహ్మసూత్రాలు, గీత > అద్వైతవేదాంతం
3) నిర్గుణబ్రహ్మ - నిర్వచనం
   - సృష్టి 'ఈశ్వర' > బ్ర, వి, రుద్ర
   - నిర్వికల్ప సమాధిలో జీవాత్మ సచ్చిదానంద బ్రహ్మలీన
   - తెలుసు, శ్రవణం, అనుభవ, ప్రతిబింబం > మోక్షం
4) తపస్సు .. ఆత్మను పరమాత్మలో ఏకత! (ఏకత గుర్తించకపోవడం వల్లే యాతనలు)
   జ్ఞానమార్గం .. ఈ జీవితకాలంలోనే
5) భక్తి, కర్మ మార్గమే చాలవని.. ధ్యానం > జ్ఞా
   వివేకం, వైరాగ్యం ద్వారా.. ప్రాపంచిక భోగ..
   స్తోత్రాలు .. భ, క మెట్లుగా
6) బౌద్ధం నుంచి: నిర్గుణబ్రహ్మ = శూన్యత

IMPQ: Set 4 B.T. P: 118 లోని ప్రశ్నను చదువుకొనవలెను.

7) మత-కోరిక తృష్ణ - సంఘాల్లో ఆర్థిక వాంఛల పట్టిమ ... ఉపబంధా భావాల వివరం
8) నైతిక జీవనం .. కోర్కెలను విసర్జించు
9) జ్ఞానమార్గం కొద్దిమందికే!

c) రైతులు ప్రధాన పంటలు పండించినా భూస్వామ్య ప్రభువు ప్రధాన పంటలు అనవసరమైనా అనుకొనేవారు 'అందువల్ల కనీస పంట పండించాలనే ధ్యాస గాని, ప్రధానంగా పండించాలనే ఆసక్తి రైతులకు సన్నగిల్లింది. ప్రధాన పంటలు లేక పోవడం వల్ల వాణిజ్యం చేసే అవకాశం కూడా క్రమంగా పోయింది.

d) గ్రామాలు, స్వ గ్రామ సమాజాలు తమకు కావలసిన అవసరాలను తామే తీర్చుకొనే స్వయం సమృద్ధ ఆర్థిక వ్యవస్థను అభివృద్ధి చేసుకున్నాయి.

అయితే ఢిల్లీసుల్తానులు, మొగల ప్రభువుల కాలంలో భూస్వామ్య ప్రభువుల రైతుల, కూలీల శ్రమలను, ఆస్తులను రక్షణ ~~కల్పించ~~ బాధ్యతల కల్పించారు. రెండవ భూస్వామ్య ప్రభువులు వ్యవసాయ విస్తరణకు, అభివృద్ధికి కూడ కృషి చేశారు.

• చివరికి పరిస్థితి తీవ్రత అర్థం > ఉపశమన చర్యలు 1) రుణాలివ్వడం 2) బాకీలు రద్దు 3) కొత్త భూముల్ని సాగు లోకి 4) ప్రత్యేక రాష్ట్ర వ్యవసాయ శాఖ ఏర్పాటు

---- చాలా ఆలస్యమైపోయింది!

• "దివాన్-ఇ-కోహి" — ప్రత్యక్ష సాయం ద్వారా కొత్త భూముల్ని సాగు లోకి తేవడం --- ఇందుకై 60 చ.మైళ్ళ భూమిని ఎంపిక ---- వివిధ పంటలకై 2 ఏళ్ళ ప్రభుత్వం 70 లక్షల టంకాలు. భూమి అవసరం ఉన్నవారికి ఇచ్చారు... దురదృష్ట వశాత్తు విఫలమైంది!

• 1) ఎన్నుకున్న భూమి సారవంతమైంది కాదు
  2) రెండేళ్ళ కాలం నిర్దిష్ట ఫలితం పొందే చాలా తక్కువ సమయం
  3) డబ్బు సరిగా వ్యయం చేయలేదు.., చాలా వృథా... అధికార అవినీతి

• అంతేకాక ప్రయోగం లేని MBT సామ్రాజ్య పతనం + అపకీర్తి పాలు చేయడం అయ్యింది... దేశవ్యాప్త కల్లోలం ప్రజా ఆగ్రహం MBT పాలన [illegible]

## MBT రాజరిక సిద్ధాంతం

• ప్రారంభంలో ఖలీఫా ని గుర్తించలేదు... తన నాణేలపై 'భూమి పై దేవుని నీడ' 'భగవంతుడు సుల్తాన్ మద్దతుదారుడు' 'ఎవరు సుల్తాన్ కి విధేయులు వారు నిజంగా దేవునికి విధేయులు'

• సుల్తానే అత్యున్నత న్యాయాధికారి.. ముఫ్తీలతో చర్చించినా... చివరికి తన సొంత అభిప్రాయ ప్రకారం నడుచుకునేవాడు... కాజీలు - ముఫ్తీలు కాకపోయినా [illegible] న్యాయాధికారాలిచ్చాడు.

• వైభవోపేత దర్బారు... పర్షియా [illegible]

• కొన్ని వైఫల్యాలు... సుల్తాన్ లో మార్పు...
"భూమి పై దేవుని ప్రతినిధిగా" గా మారడం - ఈజిప్టు ఖలీఫా ని తనపై ధ.సుల్తా. సార్వభౌమ ప్రమాణించవలె వేడె

ఖలీఫా దూతలు ఢిల్లీ వస్తే రాజ స్వాగతం ఇచ్చాడు! ఇవన్నీ
కేవలం తన ప్రజల్లో తనపట్ల గౌర, ప్రతిష్ఠలు, అధికార పెంచుకోవడానికే. 157



- - - - - - -

MBT కి గొప్ప సదాశయాలు, అద్భుత ఆలోచనలున్నాయి కాని
వాటి ఎంతవరకు ఆచరణలో సామర్థ్యం లేదు...

- సతి నిషేధం
- వైద్యశాలల నిర్మాణం
- పేద & అనాథ బాలలు
- వ్యవసాయ విభాగం మొ॥ ఇతర ప్రాజెక్టులు.....

MBT 1351 లో థట్టా వద్ద వ్యాధితో చనిపోయాడు!

"రాజు తన ప్రజల నుంచి ప్రజలు తమ రాజు నుంచి విముక్తి పొందారు"

— బదౌని.

# ఢిల్లీ సుల్తానత్ పతనానికి ఫిరోజ్ బాధ్యత

## 1) సైనిక పరాజయాలు - ప్రాదేశిక నష్టం

- ఫిరోజ్ సామ్రాజ్య వారసత్వంగా > తిరుగుబాటు ప్రాంతాల్ని తిరిగి రాబట్టే ప్రయత్నం చేయలేదు > అసలు దండయాత్రలు చాలా వరకూ విఫలమైనాయి!
- బెంగాల్ గవర్నర్ ఆధి. బా. > బెంగాల్ పై రెండు దం.యా.. విఫల > సుల్తాన్ బలహీన పట్టుబడులు ...& బెంగాల్ కోల్పోయారు
- 1361-62 సింధ్ పై దాడి... సైన్యం పై కరువు ప్రభావం... గుజరాత్ కి వస్తే దారితప్పి 6 నెలలు 'కచ్' లో... చివరికెలాగో సింధ్ ని ఆక్రమించినా ... అసలు సైనిక/యుద్ధ నైపుణ్యం లేదని...
- దక్కను, దక్షి.భార D.S లని తిరిగి తెచ్చే ప్రయత్నం చేయలేదు... D.S D, Doab కి పరిమితమైంది!

## 2) మత ఛాందసుడు

- తనకు ఖలీఫా వద్ద అధిక గౌరవం... తను 'భువి పై ఖలీఫా డిప్యూటీ' గా ప్రకటించుకున్న తొలి సుల్తాన్.
- ఉలేమాల మత మార్పిడి ని ప్రోత్స... హిందువు, షియా, సూఫీలు, మహదవిస లను హింసించాడు.. సయ్యదులు, సుఫీలను ఆదరించాడు.... రాజ్యవ్యవ ఉలేమాల ప్రభావాన్ని పెంచి
- హిందూ చేత పాలింపబడుతున్న నాగరకోట్ పై దాడి... పేపర్ + జ్వాలాముఖి ఆలయాన్ని ధ్వంసం... జాజనగర్ దాడిలో సైతం ఆలయాల ధ్వంసం
- ఇస్లాం చట్టాల అమలు (బ్రాహ్మణ మీద జిజియా విధించిన తొలి సుల్తాన్
- భూమి.శి. పన్నులు లో హిం, ముస్లిం ల మధ్య వివక్షత చూపాడు... ముస్లిం ల నుండి పంట లో $\frac{1}{10}$ వ వంతు ఖరాజ్ పన్నులు చేస్తే హిందువుల నుండి ఉషర్ (Ushar) ... ఇది నిర్దిష్టంగా చెప్పబడలేదు... వసూలు చేసేవారు!

- సైనిక ప్రముఖులకు జీతాలు గాక జాగీర్లు ... సైనికులకు భూమి నుండి ట్రాన్స్‌ఫరబుల్ అసైన్‌మెంట్స్ లో భూమి.
- మిలిటరీ కమాండర్ల ని వారసత్వ ప్రాతిపదికన
- దాగ్, హులియా విధానాన్ని రద్దు చేశాడు...



- సైన్యం లో అవినీతి, నెపోటిజం, ఆశ్రిత పక్షపాతం
- సైనిక వేతనం లో ఉన్న పంచుకోవటాలు గా

- - - - - - -

- ఒకప్పటి సుల్తానుల భారీ అజేయ సైన్యం క్షీణించడానికి ఫిరోజ్ వ్యక్తి వ్యక్తిగతం గా బాధ్యుడు !

* బలహీనమైన ఫిరోజ్ వారసులు ... సర్దార్ల చేతుల్లో కీలుబొమ్మలుగా...

2) పరమాత్మ వ్యాప్తి .. కొండ, పిట్ట, పూరేకులను
మలిపించాడు.

3) విచక్షణా లేని ఔదార్యం

5) ఫిరోజ్ బానిస విధానం

- బానిసల పెంపు
- అధిక వ్యయం
- బానిసలు పరిపాలనలో జోక్యం చేసుకొని....

# మొగలు సామ్రాజ్య పతనానికి గల కారణాలు

Read Guide

## రాజకీయ కారణాలు

1) అత్యవసరమైన అంతర్యుద్ధాలు వారసత్వం కోసమై
1657-58, 1707-08, 1712 .. సయ్యద్ సోదరులు — King makers గా
2) ఔరంగజేబు రాజధానికి చాలా కాలం దూరంగా ఉండడం వలన
ఉద్యో.. అవినీతి... అజాగ్రత... గవర్నర్లు స్వాతంత్ర్యం ప్రకటించు జిత్తులు పన్నినారు
3) నిరోధ - సమతౌల్య సిద్ధాంతం ఆ వ్యవస్థ ... పరిపాలనా వ్యవస్థ విచ్ఛిన్నం చెందడం వల్ల
4) అత్యంతంగా కేంద్రీకరించబడ్డ పరిపాలన... వ్యక్తిగత వైఫల్యాలు & వ్యవస్థాగత వైఫల్యాలు
5) 1738-39 లో నాదిర్షా ఢిల్లీ ని దోచుకోవడం... కారణం కాదు ఫలితమని కొందరు చరిత్రకారులు

## ఆర్థిక కారణాలు

1) 1679 రాజపుత్ర యుద్ధం మొదలుకొని .. ఔరంగ మరణం నాటికి దివాలా
2) ప్రజా పనులకి నిధులు లేక ఆపడం ... ప్రజల్లో అసంతృప్తి
3) సైనికుల జీతాలు బకాయిపడ్డం.. సైనికుల్లో అసంతృప్తి
4) ఉద్యోగుల సంఖ్య జీతాలు పెరగ్గా సామ్రాజ్య ఆదాయ వనరులు పెరిగినా సమాన నిష్పత్తి లో పెరగలేదు!
5) జాగీర్దార్ల అక్రమాలకి వ్యతిరేకంగా జమీం నేతృత్వం లో రైతుల తి. బా.
6) జాగీరుల కొరత .. జాగీర్దారీ సంక్షోభం
7) ప్రభుత్వోద్యోగులు లంచాల కోసం వేధించడం...
8) నిరంతర యుద్ధాలు మొగ ఢిల్లీ లో జనాభా, వృత్తి, వర్త తగ్గి ఉండొచ్చు..
కాని ఉ. భా, సాంస్కృ. ప్రాదేశికం మాత్రం బలమైన పాలన, వృత్తి, వర్త ↑

19.11.06

## India 750 – 1200 : Major dynasties and political structures in North India.

క్రీ.శ. 750 - 1000 మధ్య ఉత్తర భారతం, దక్కనులలో ముఖ్యంగా మూడు శక్తివంతమైన పెద్ద సామ్రాజ్యాలు ప్రవర్ధిల్లాయి. అవి :

1. పాలరాజ్యం: సంపూర్ణ వంగదేశం, బీహారులో కొంత భాగం పాలరాజ్యంలో ఉండేవి. 8వ శతాబ్దపు మధ్యం వరకూ బెంగాలులో దాదాపు ఒక శతాబ్దంపాటు రాజకీయ అవ్యవస్థిత పరిస్థితులు నెలకొని ప్రజాజీవనం సక్రమంగా జరుగలేదు. ఈ సమయంలో ప్రభువర్గములందరూ కలసి గోపాలుని రాజుగా ఎన్నుకున్నారు. ఇతడే పాలవంశ స్థాపకుడు. ఇతడు స్థానికుల సాయముతో రాజకీయ సంక్షోభమును అరికట్టి శాంతి, భద్రతలను నెలకొల్పెను. మోంఘీర్ (Monghyr) ఇతని రాజధాని. ఇతడు క్రీ.శ. 750 నుండి 770 వరకు బెంగాల్‌ని పాలించి భవిష్యత్ రాజ్య గొప్పతనానికి పునాదివేశాడు.

గోపాల కుమారుడైన ధర్మపాలుడు (క్రీ.శ. 770-810) ప్రతిహారులనోడించి, కనౌజ్‌ను ఆక్రమించి తన అనుచరుడైన చక్రాయుధుని రాజుగా చేసిన వీరుడు. కానీ రాష్ట్రకూటుల చేతిలో ధర్మపాలుడు ఓడాడు. ఇతని కాలమున పాలరాజ్యము బ్రహ్మపుత్ర నుండి కాశీవరకు విస్తరించెను. ధర్మపాలుడు బౌద్ధుడు. ఇతడు

~~విక్రమశిల విహారమును నిర్మించి దానిని గొప్ప~~
~~విద్యాకేంద్రంగా అభివృద్ధి చేసెను.~~

ఉత్తరాపథమున సార్వభౌమత్వమునకై ప్రతిహారులతోను, రాష్ట్రకూటులతోను సంఘర్షణ పడ్డారు. రాష్ట్రకూట రాజైన మూడవ ధ్రువుడు ప్రతిహారులను ఓడించి, గంగ, యమున అంతర్వేది వైపు సాగి ~~పాల రాజైన~~ ధర్మపాలుని కూడా ఓడించాడు. అయితే మూడవ ధ్రువుడు దక్షిణానకు మరలగానే ధర్మపాలుడు ఉత్తర భారతదేశ దండెత్తి ~~ప్రతిహారుల నోడించి~~ కనూజ్ ను ఆక్రమించి తన అనుచరుడైన చక్రాయుధుని రాజుగా చేసాడు.

← maybe deleted

[కాని ప్రతిహార రాజైన రెండవ నాగభటు [వత్సరాజు కుమారుడు] కనూజ్ పై దండెత్తి కనూజ్ ను ఆక్రమించాడు. ఇంకా తూర్పువైపున మరలి మొంఘీర్ వద్ద ధర్మపాలుని ఓడించాడు. రెండవ నాగభటు కనూజ్ ను తన రాజధానిగా చేసుకొన్నారు. అతడు, అతని తరువాతి వారు దాదాపు 200 సంవత్సరాలు పరిపాలించారు.]

ధర్మపాలుని కాలమున పాలరాజ్యము బెంగాలు నుండి కాశీ వరకు విస్తరించెను. ధర్మపాలుడు బౌద్ధుడు. ఇతడు విక్రమశిల విహారమును నిర్మించి దానిని గొప్ప విద్యాకేంద్రంగా అభివృద్ధి చేసెను. నలంద లాగా ఇదీ పెద్ద విద్యాకేంద్రంగా భాసిల్లింది.*
ధర్మపాలుని తరువాత సింహాసనాన్ని అధిష్టించిన

దేవపాలుడు (క్రీ.శ. 810-850) గొప్ప విజేత. ఇతడు కళింగ, అస్సాంలను జయించి తన రాజ్యమును కలిపెను. టిబెట్ బర్మా తెగ అయిన కాంభోజుల దాడులను తరిమికొట్టి రాజ్యమును కాపాడెను. ప్రతీహార రాజైన భోజుని దాడులనుకూడా దేవపాలుడు వీరోచితముగా ఎదుర్కొన్నాడు. దేవపాలుడు కూడా బౌద్ధుడే.

దేవపాలుని అనంతరము పేర్కొనదగిన రాజు మహీపాలుడు. ఇతని కాలమునందే చోళరాజగు రాజేంద్రుడు బెంగాలుపై దండెత్తి (సుమారు క్రీ.శ. 1021) గంగానదివరకు దండయాత్ర సాగించెను.

మహీపాలుని యనంతరము కాంభోజ కైవర్తాది తెగల దాడులవలన, చేది, కళింగాధిపతుల పోరు వలనను పాలరాజ్యము క్షీణించెను.

ఇట్టిస్థితిలో రామపాలుడు సింహాసనమధిష్టించి కైవర్త నాయకుడైన భీముని ఓడించి తన పూర్వీకులు కోల్పోయిన ప్రాంతాలను తిరిగి ఆక్రమించెను. ఉదయపరి కళింగ కామరూపములను కూడ జయించెను.

రామపాలుడే మరణించిన (క్రీ.శ. 1120) తరువాత రాజ్యమునకు వచ్చిన వారి బలహీనులు అసమర్థులు కావటంతో, 1138 సంవత్సరంలో సేన వంశీయులు బెంగాల పాలకులైరి. పాల సామంతుడగు విజయసేనుడు 1138లో తడపటి పాలరాజు అయిన మదనపాలుని పదవీ భ్రష్టుని చేసి బెంగాలును ఆక్రమించెను.

సందర్శించిన సులేమాన్ (Sulaiman) అనే అరబ్ వర్తకుడు పాలవంశ రాజైన ధర్మపాలుని గొప్పగా పేర్కొన్నాడు. అతడు పాల రాజ్యాన్ని రుహ్మ (రహ్మా ధర్మ: ధర్మపాలుని సంక్షిప్తం)గా పేర్కొని పాలరాజు తన పొరుగువారైన ప్రతీహారులు, రాష్ట్రకూటులతో తలపడుతూ ఉండేవాడని అయితే అతని సేనల సంఖ్యాబలం వారికంటె చాలా ఎక్కువని పేర్కొన్నాడు. అతనికి దాదాపు 50,000 గజబలం ఉన్నట్లు తెల్పాడు.

టిబెటన్ క్రానికల్స్ కూడా పాలరాజుల ఐతిహ్య సమాచారాన్ని అందిస్తున్నాయి. వీటిననుసరించి పాలరాజులు బౌద్ధ విద్యను, మతాన్ని గొప్పగా పోషించారని తెలుస్తుంది. యావత్తు ప్రపంచం అంతా బాగా ప్రసిద్ధిచెందిన నలందా విశ్వవిద్యాలయాన్ని ధర్మపాలుడు పునరుద్ధరించి, 200 గ్రామాలను దాని ఖర్చుల కోసం కేటాయించాడు. అతడే విక్రమశిల విశ్వవిద్యాలయాన్ని స్థాపించాడు. ఇది నలంద తర్వాత అంతటి ప్రసిద్ధిని పొందింది. ఇది మగధలో గంగానది ఒడ్డున ఒక కొండపై అహ్లాదకరమైన పరిసరాల నడుమ ఉండేది. పాల రాజులు పెక్కు విహారాలను నిర్మించారు. వీటిలో బౌద్ధ భిక్షువులు పెద్ద సంఖ్యలో నివసించేవారు.

పాలరాజులు టిబెట్‌తో సన్నిహితమైన సాంస్కృతిక సంబంధాలు నెరపారు. శాంతరక్షిత, 20.1
దీపాంకర (శ్రీజ్ఞాన అతిశ అనేవారు) అనే బౌద్ధ ప్రతిభావంతులైన బౌద్ధ పండితులు టిబెట్‌ను సందర్శించారు. వారు అక్కడ నూతన మతంగా బౌద్ధాన్ని (మాంత్రికులతో కూడినది) ప్రవేశపెట్టారు. దీని ఫలితంగా పెద్దసంఖ్యలో టిబెటన్ బౌద్ధులు నలంద, విక్రమశిల విశ్వవిద్యాలయాల్లో చదువుకొనేందుకు వస్తుండేవారు.

ఆగ్నేయాసియాలో కూడ పాలరాజులతో ఈ స్నేహితుల వర్తక సంబంధాలు, సాంస్కృతిక సంబంధాలు ఉండేవి. ఆగ్నేయాసియాలో వర్తకులు వంటి లాభదాయకంగా ఉండి, పాల రాజ్య సౌభాగ్యానికి ఎంతో దోహదం చేసింది. మలయా, జావ, సుమత్రా, ఇతర పొరుగు దీవులను పాలించిన శక్తివంతమైన శైలేంద్ర వంశం (వీరిది బౌద్ధమతం), పాలరాజుల ఆస్థానానికి పెక్కు దౌత్యవేత్తలను పంపింది. శైలేంద్ర వంశస్థుడైన బాలపుత్రదేవుడు నలందా నందు ఒక విహారాలను నిర్మించాలనుకుంటూ అనుమతి కోరగా దేవపాలుడు అనుమతినిచ్చాడు. అంతేకాక దాని నిర్వహణ కొరకు 5 గ్రామాలను కూడ కేటాయించెను. ఇది ఆగ్నేయాసియాలోని సత్సంబంధాలను సూచిస్తుంది. పాలరాజులు బౌద్ధమతాభిమానులైనను పరమత సహనం కలిగినారు. వీరు బ్రాహ్మణులకు దానధర్మాలు చేయుచుండడమే గాక అనేక హిందూ దేవాలయాలను నిర్మించిరి.

20.11.06

# ప్రతీహారులు

## ఉత్తర భారతదేశంలో మొట్టమొదట

రాజకీయాధికారాన్ని స్థాపించిన రాజపుత్రవంశం ప్రతీహారులది. వీరు మధ్య ఆసియాకి చెందిన "గుర్జర" అనే జాతికి చెందినవారు. హూణుల తర్వాత వీరు భారతదేశంలో స్థిరపడ్డారు. అరబ్బుల రచనలు, వీరి శాసనాలు కూడా వీరిని "గుర్జర" ప్రతీహారులుగానే పేర్కొన్నాయి. ప్రతీహారుల్ని ద్వారపాలకులని రాష్ట్రకూటులు చులకనగా వ్రాశారు. ప్రతీహారులు బహుశా రాజప్రాసాదంలో అధికార్లుగా (ఉద్యోగులుగా) ఉండవచ్చు. క్రమేణా అధికారం చేజిక్కించుకొని స్వతంత్ర పాలకవంశంగా పరిణతి చెందారు. ఆ కాలానికి సంబంధించిన ఆధారాలను బట్టి, ప్రతీహారులు మొట్టమొదట "మ్లేచ్ఛులను" ఓడించి బలపడ్డట్లు తెలుస్తోంది. మ్లేచ్ఛులంటే బహుశా సింధులోని అరబ్బులు కావచ్చు. ప్రతీహారులు అరబ్బులమీద విజయం సాధించాక, స్వతంత్రులై మొదట వీరు రాజ్యస్థాపన మాళ్వాలో ఉజ్జయిని రాజధానిగా తూర్పుదిశకు విస్తరించారు. ~~రాజస్థానంలోని జోధ్‌పూర్‌లో మొదట స్థిరపడ్డారు~~ చేశారు. మొదటి నాగభట్టుని కాలంలో రాజ్యస్థాపన జరిగింది. ఇతడు క్రీ.శ. 725 నుండి 750 వరకు పాలించాడు. అరబ్బుల, చాళుక్యుల, రాష్ట్రకూటుల దండయాత్రలను సమర్థవంతంగా ఎదుర్కొని రాజ్యాన్ని సుస్థిరం చేశాడు. ఆ తదనంతరం పేర్కొనదగిన ప్రతీహార రాజు ~~రెండవ~~ వత్సరాజు ~~నాగభట్టుడు (క్రీ.శ. 800 – 825)~~. (క్రీ.శ. 778 – 800).

ఇతడు పాలరాజైన ధర్మపాలుని ఓడించాడు కాని, తాను రాష్ట్రకూట రాజైన మూడవ ధ్రువుని చేతిలో పరాజయం పొందాడు. వత్సరాజు రాజ్యాన్ని జోధ్‌పూర్ వరకు విస్తరించాడు.

వత్సరాజు కుమారుడు రెండవ నాగభట్టుడు (క్రీ.శ. 800 - 825) రాష్ట్రకూట రాజైన మూడవ గోవిందునిచే ఓడింపబడి మాళ్వనుండి ~~వెళ్ళ~~ గూర్జరాత్రకు మరలినాడు. తరువాత తన శత్రువైన చక్రాయుధుని ఓడించి కనూజ్‌ని ఆక్రమించాడు. ఇంకా తూర్పువైపుకు మరలి మోంఘీర్ వద్ద ధర్మపాలుని ఓడించాడు. రెండవ నాగభట్టు కనూజ్‌ను తన రాజధానిగా చేసుకొని ఏలాడు, అతని తరువాత వారు దాదాపు రెండు శతాబ్దాలపాటు పరిపాలించారు.

(ప్రతీహార రాజవంశంలో అత్యంత గొప్పవాడు భోజరాజు (క్రీ.శ 836 - 885). ఇతడు రెండవ నాగభట్టుని మనుమడు. ఇతడు మిహిర, ఆదివరాహ అనే బిరుదులు ధరించాడు.* ఇతడు గొప్ప సాహిత్య పోషకుడు. వైష్ణవ మతాన్ని ఆదరించాడు. భోజుడు పాల, రాష్ట్రకూట రాజులను జయించి తన రాజ్యాన్ని విస్తరించాడు. తన ~~కనూజ్ అతని రాజ్యానికి రాజధా~~ ఉత్తరాన హిమాలయాలు, దక్షిణాన నర్మదానది, తూర్పున బీహార్, పడమట గుజరాత్ అతని రాజ్యానికి సరిహద్దులు. అరబ్బు యాత్రికుడు సులేమాన్, మిహిర భోజుని రాజ్యాన్ని క్రీ.శ. 851లో సందర్శించాడు. భోజుని రాజ్యం సుసంపన్నంగా ఉందని, దొంగలు లేరని, రాజు అశ్వదళం

రక్తవంతమైనదని, సుదీర్ఘమైన ఆ రాజ్యంలోని పరిస్థితులను తెలియజేస్తాడు. మిహిర భోజుని కుమారుడు మహేంద్రపాలుడు (క్రీ.శ. 885 - 908) తన తండ్రి రాజ్యాన్ని పరిరక్షించడమే కాక, పాల రాజైన నారాయణపాలుని ఓడించి మగధ, గౌడలను కలుపుకొని, ఉత్తర బెంగాల్ వరకు తన రాజ్యాన్ని విస్తరింపజేశాడు.

మహేంద్రపాలుని తర్వాత సింహాసనం

అధిష్టించిన అతని కుమారుడు మహీపాలుని క్రీ.శ. 915లో రాష్ట్రకూట రాజైన మూడవ ఇంద్రుడు ఓడించి కనౌజని ఆక్రమించాడు. అయితే కొంత కాలం తర్వాత మహీపాలుడు తిరిగి తన ~~రాజ్యాన్ని~~ ~~ఆధిపత్యాన్ని~~ నెలకొల్పగలిగాడు. అయితే మహీపాలుణ్ణి, రాష్ట్రకూట రాజైన మూడవ కృష్ణుడు క్రీ.శ. 940లో ఓడించాడు. మహీపాలుని తర్వాత వచ్చిన రెండవ మహేంద్రపాలుని కాలంలో ప్రతీహార రాజ్యం క్షీణించటం మొదలయ్యింది. రాష్ట్రకూటుల దండయాత్రలను, ~~బలహీన~~ బలహీనమైన ప్రతీహార రాజులను ఆసరాగా చేసుకొని - ప్రతీహార సామంతులైన చాళుక్యులు, చౌహానులు, పరమారులు, కాలచుర్యులు చందేలులు, గహడవాలులు, కచ్ఛపఘాటులు మొదలైనవారు స్వతంత్రాన్ని ప్రకటించుకున్నారు. క్రీ.శ. 1018లో మహమ్మద్ గజనీ కనౌజ్ ~~పై~~ పై దండెత్తినప్పుడు రాజ్యపాలుడు కనౌజ్‌ను అతనికి అప్పగించి పారిపోయాడు. అతను ~~చివరకు~~ చందేల రాజు చేతిలో వధింపబడ్డాడు. దీనితో ప్రతీహార రాజవంశం అంతం అయింది.

ప్రతీహార రాజులు గొప్ప విద్యా, సాహిత్య పోషకులు. సంస్కృతంలో గొప్ప కవి, నాటకకర్త అయిన రాజశేఖరుడు భోజుని మనుమడైన మహీపాల ఆస్థానంలో ఉండేవాడు. ప్రతీహార రాజులు కనౌజ్ లో పెద్ద (అందమైన) భవనాలను, దేవాలయాలను నిర్మించి దానిని సుందరంగా తీర్చిదిద్దారు.

23.11.06 **Political Ideas & organisation (750 A.D. to 1000)**

(పాల రాజులు, ప్రతీహారులు రాష్ట్రకూటుల కాలంనాటి రాజకీయ భావనలు, నిర్వహణ)

ఈ రాజ్యాలలో రాజనీతి, పాలనాపద్ధతులు ప్రాచీన
పూర్వకాలంలోని సామ్రాజ్యాల (మౌర్య గుప్తుల) పద్ధతులపైన, దక్షిణాన బాదామి చాళుక్యుల పద్ధతుల మీద ఆధారపడి ఉన్నాయి. పాలన వ్యవస్థలో చక్రవర్తి / రాజు అత్యున్నత స్థానంలో ఉండి రాజ్య విధులు చేసేవారు. చక్రవర్తి తన మంత్రులతోటి దేశపాలన జరిపేది. చక్రవర్తి సర్వసైన్యాధ్యక్షుడు. ఇంకా గొప్పగా, ఆడంబరంగా ఉండే రాజాస్థానం రాజకీయ వ్యవహారాలకు, న్యాయపాలనకు, సాంస్కృతిక కార్యక్రమాలకు కేంద్రస్థానంగా, ఐశ్వర్యవంతంగా ఉండేది. రాజు దైవాంశసంభూతుడని ప్రజలు విశ్వసించేవారు. ఆనాటి మత గ్రంథాలు కూడా ఈ అంశాన్ని ఘోషిస్తున్నాయి. అయితే మేధాతిథి వంటి పండితులు అన్యాయంగా ప్రవర్తించే రాజును ఎదిరించడం సబబే అని భావించారు. రాజుల మధ్య, రాజులకు, సామంతులకు మధ్య నిరంతర పోరాటాలు సాగేవి. పదాతి దళం, అశ్వికదళం రాజాస్థాన సైన్యంలో ఉంచబడేవి. రాజులు తమ రాజ్యపాలనలో సంబంధీకులు

కాపాడటానికి ప్రయత్నించినా, దూర ప్రాంతాల్లో ఆ శక్తి ప్రభావం అంతగా ఉండేదికాదు.

రాజు పెద్ద కుమారుడు వంశపారంపర్యంగా రాజు కావాలన్న వారసత్వ సిద్ధాంతం అమలులో ఉన్నప్పటికీ దీని అంత గట్టిగా పాటించేవారు కాదు. చక్రవర్తి తన జీవితకాలంలోనే జ్యేష్ఠ కుమారుడికి కాని, తనకు నచ్చిన మరో కుమారుడికి కాని యువరాజు పట్టాభిషేకం చేసేవాడు. ~~యువరాజు~~ రాజ్యంకోసం రాజకుమారుల మధ్య అనేక సందర్భాలలో యుద్ధాలు జరిగేవి. ఉదా., నాలుగో గోవిందుడు (రాష్ట్రకూట రాజులు) స్వయంగా తన అన్నలను ఓడించి రాజ్యాధికారాన్ని చేపట్టాడు. యువరాజు రాజధానిలో ఉండి రోజువారీ పాలనలో రాజుకి సహకరించేవాడు. రాజు తన కుమారులను ఆయా ప్రాంతాలకు రాజప్రతినిధులుగా (గవర్నర్లుగా) పంపేవాడు.

చక్రవర్తికి సాధారణంగా అనేకమంది మంత్రులు సలహాదారులుగా ఉండేవారు. వీరు ఉన్నత కుటుంబాలకు చెందినవారై ఉంటారు. తరచూ ఈ స్థానం వారసత్వంగా సంక్రమించేది. పాల రాజుల శాసనాలలో, ధర్మపాలుడు, అతని తరువాత వచ్చిన రాజులకు. మహామంత్రులుగా వరుసగా నలుగురు ఒకే బ్రాహ్మణ కుటుంబం నుంచి వారసత్వపరంగా పనిచేశారు. కేంద్ర ప్రభుత్వంలో వివిధ శాఖలున్నట్లు తెలుస్తున్నది కాని, ఈ శాఖల సంఖ్య ఎంత, అవి ఎలా పనిచేసేవి అనే అంశాలు మాత్రం వెల్లడి కాలేదు. శాసనాలు, సాహిత్య ఆధారాల ననుసరించి దాదాపు ప్రతి రాజ్యంలో విదేశాంగ మంత్రి, రెవెన్యూ మంత్రి, కోశాధికారి, సేనాధిపతి, ప్రధాన న్యాయమూర్తి,

పురోహితుడు అనే పదవులున్నట్లు తెలుస్తోంది. మంత్రులలో ముఖ్యుణ్ణి మహామంత్రిగా వ్యవహరించేవారు. రాజు ఇతర మంత్రులకంటె మహామంత్రి మీద ఎక్కువగా ఆధారపడేవాడు. పురోహితుడు తప్ప, మిగిలిన మంత్రులు అవసరమైనప్పుడు సైనిక దళాలు నిర్వహించగలగాలి. రాజాంతఃపురంలో పనిచేసే ఉద్యోగుల ప్రస్తావనకూడా చారిత్రక ఆధారాలలో కనిపిస్తుంది. వీరిలో కొంతమంది అధికారాలు ప్రాముఖ్యతను కలిగివుండేవారు.

ఆనాటి సామ్రాజ్యాలలో మహారాజే నేరుగా పరిపాలించే ప్రాంతాలు, సామంతులు పరిపాలించే ప్రాంతాలు అనే రెండు రకాల ప్రాంతాలుండేవి. సామంత రాజులు తమ అంతరంగిక వ్యవహారాలలో ~~స్వేచ్ఛను~~ స్వతంత్రతను కలిగివుండేవారు. ఈ సామంతరాజులు ప్రతిసంవత్సరం మహారాజుకు కప్పం చెల్లించవలసివుండేది. చక్రవర్తి కోరినప్పుడు యుద్ధాలు చేయడానికి సైనికదళాలను సరఫరా చేసేవారు. ఈ సామంతరాజులు తిరుగుబాటు చేయకుండా సామంతరాజు వారసుణ్ణి చక్రవర్తి కొలువులో ఉంచేవారు. ప్రత్యేక ఉత్సవాల సందర్భాల్లో ఈ సామంతరాజులు చక్రవర్తి ఆస్థానానికి రావలసి ఉండేది. చక్రవర్తి కోరితే తమ కుమార్తెలను చక్రవర్తికిగాని, అతని వారసులకుగాని ఇచ్చి వివాహం చేయవలసివచ్చేది. ఈ సామంత రాజులు నిరంతరం స్వేచ్ఛను కోరుకోవడంవల్ల చక్రవర్తికి, వారికి మధ్య తరచు యుద్ధాలు జరుగుతుండేవి. రాష్ట్రకూటులు వేంగి సామంతులతోను, కర్ణాటకలోని గంగవంశపు సామంతులతోను అనేక యుద్ధాలు చేయవలసి వచ్చింది. అట్లే ప్రతీహారులు

ఈ కాలంలో దక్కనులో వంశపారంపర్యంగా ఉండే రెవెన్యూ అధికారుల ప్రాబల్యం పెరగటం గమనించదగిన అంశము - వీరిని "నాడ్-గవుండ్లు" లేదా "దేశగ్రామకూటాలు" అని వ్యవహరించేవారు. మహారాష్ట్రలో అనంతర కాలంలో దేశముఖ్‌లు, దేశ్ పాండేలు నిర్వహించిన పాత్రనే రాష్ట్రకూటుల కాలంలో వీరు నిర్వహించేవారు. వీరి వల్లే ఉత్తరభారతంలో చిన్న చిన్న నాయకులు (భగల నాయకులు) ఆరంభం సమాజంమీద, దేశ రాజకీయాలపైనా గట్టి ప్రభావం చూపింది. ఈ వంశపారంపర్య అధికారుల ప్రాబల్యం పెరిగిన కొద్దీ గ్రామసంఘాలు బలహీనపడ్డాయి. మహారాజులకు కూడా వీరిని అదుపు చేయడం కష్టసాధ్యమైంది. ఈ దశలో ప్రభుత్వం "భూస్వామ్యీకృతమైనదని" (feudalised) చెప్పవచ్చు.

ఈ కాలంలో సామ్రాజ్య నిర్వహణకూ, విస్తరణకూ పెద్ద సైన్యం అవసరం ఉండేది. అరబ్ యాత్రికుల కథనాల ప్రకారం పాల, ప్రతీహార, రాష్ట్రకూట రాజులకు అపారమైన, పటిష్టమైన పదాతి దళం, అశ్విక దళం, గజదళం ఉండేవి. పాలరాజుల గజదళం బాగా ప్రసిద్ధి పొందితే, ప్రతీహారరాజుల అశ్వికదళం ప్రసిద్ధి గాంచింది. రాష్ట్రకూటులకు అనేక కోటలుండేవి. ఈ కోటల్లో ఉండే సైన్యాలకు ప్రత్యేకమైన సైన్యాధికారి నాయకత్వం వహించేవాడు. పాల రాజులకు, బహుశా రాష్ట్రకూటులకు కూడ నౌకాదళం ఉండేది. అయితే ఈ నౌకాదళం వివరాలు మనకు తెలియ రాలేదు.

ఆ రోజుల్లో రాజ్యానికి, మతానికి గల సంబంధం కూడ గమనించదగిన అంశం. చాలా మంది రాజులు ఆ రోజుల్లో శైవ, వైష్ణవ, బౌద్ధ, జైన మతాలను పాటించేవారు కాని అన్ని మతాలను ఆదరించేవారు. బ్రాహ్మణులకు, బౌద్ధ విహారాలకు, జైన దేవాలయాలకు భూరి విరాళాలను ఇచ్చేవారు. ఒక వ్యక్తి లేదా వారిని మతప్రాతిపదికగా ఏ రాజు బాధించలేదు. మేధాతిథి ననుసరించి రాజు "రాజధర్మం" అర్థశాస్త్రం నుంచి వచ్చింది. అంటే రాజకీయాలు, మతం వేరువేరుగా చూడబడ్డాయి. దీనిబట్టి మనం ఈ కాలంలో రాజ్యం "లౌకిక" మైనదిగా చెప్పవచ్చు.

— o —

పల్లవి. [illegible]

# INDEX

NAME : ____________ STD. : ________ SEC. : ______ ROLL NO. : ______

population & agricultural production p 155 of Dolphin book

4.11.06 16, 17 శతాబ్దాల కాలంనాటి సమాజంలో స్త్రీల పరిస్థితి 1

16, 17 శతాబ్దాల కాలంనాటి సమాజంలో స్త్రీలు తండ్రి పెద్దగా వ్యవహరించే కుటుంబ వ్యవస్థలో ఉండి పురుషాధిక్య ప్రభావాలకు గురి అవుతూ వుండే వారు. ఈ వ్యవస్థ కేరళ వంటి కొన్ని ప్రాంతాల్లోను, గిరిజన తెగలలో తప్పించి భారతదేశం అంతటా ఉండేది. ఇంతేకాక స్త్రీలు తండ్రినైనా, భర్త లేదా కొడుకునైనా ఆధారపడి వుండవలసిన సమస్యలను ఎదుర్కొనేవారు. ఈ అవధుల మధ్య ఉన్నత వర్గాలకు చెందిన స్త్రీలకు, సామాన్యవర్గ స్త్రీలకు జీవితాల్లో చాలా తేడా వుండేది. ఉన్నత తరగతికి చెందిన స్త్రీలు చదువుకున్న వారై ఉండి, విలాసవంతమైన జీవితాన్ని గడిపేవారు. అయితే వారు తమ భర్తను, ఇతర అనేకమంది ఇతర భార్యలతోను, ఉంపుడుకత్తెలతోను పంచుకొంటూ, అంతఃపురానికే పరిమితమై ఉండేవారు. వీరిలో కొంతమంది తామే పాలకులుగా రాజకీయాల్లో కీలక పాత్ర పోషించారు. గోండ్వానా లో రాణి దుర్గావతి, అహ్మదనగర లో చాంద్ బీబీ మొ|| వారిందుకు ఉదాహరణ. మొఘలుల లాగా తమ భర్తల ద్వారా కొందరు మహిళలు అధికారాన్ని చెలాయించారు. జహంగీరు కాలంలోనూ ఔరంగజేబు కాలం లోనూ షాజహాను కుమార్తెలు

జహనారా రాజకీయాల్లో ముఖ్యపాత్ర పోషించింది. మొఘలుల పతన దశ లో జహ్వా, ఉధం బాయి మొ॥ వారు రాజకీయాల్లో ముఖ్యపాత్ర పోషించారు.

నాటి మహిళల తెరవెనుక కంచె

నాటి సమాజానికి వైభవ, సాంస్కృతిక గౌరవం సంపాదించింది. రాజరిక అధికారులను, పోషించి వారు ప్రభావితం చేశారు. వారు స్వయంగా ఎందరో కళాకారులను ఆదరించారు. జహనారా మఖ్ఫీ (concealed) పేరుతో రచనలు చేసింది. రోషనారా 'బెయిత్-ఉల్-ఉలుం' అనే సాంస్కృతిక కేంద్రాన్ని ఢిల్లీ లో ఏర్పాటు చేసింది. ఇందుకు గాను ఔరంగజేబు రోషనారా ను దేశబహిష్కారం గావించాడు!

బాల్య వివాహాలు, నిర్బంధ వివాహాలు, కన్యారి శిశుల్ని వాటూ నిరాకరించడం ఈ కాలం లో జరిగేవి. అక్బరు యువతీయువకుల వివాహ వయస్సు నిర్ధారించాడు, ఆడపిల్లకి పెళ్లి విషయం లో స్వేచ్ఛ ఇచ్చాడు చేసిన ప్రయత్నాలేవీ ఫలించలేదు. సతి ని నిరుత్సాహపరచడానికి మొఘలులు చేసిన ప్రయత్నాలు కూడా ~~అంతగా~~ ప్రభావం

చూపలేదు, ఎందుకంటే నాటి ప్రముఖ రాజపుత్ర కుటుంబాలన్నీ సతి ని నియమంగా పాటించేవి. 1614 లో దక్షిణ లోని ఎలిచ్పూర్ లో మహారాజా మాన్ సింగ్ కచ్చ్వాహా చనిపోయినప్పుడు అతనితో పాటు 4 రాణులు అంబర్ లో మరో పదుగురు రాణులు సతి చేశారు. సమకాలీన రాజస్థానీ లిఖిత ఆధారాల్లో కనిపించే పెద్ద సంఖ్యలోని రాణులు, వారి సంతానం మొ॥ అన్నీ చూస్తే పాలకుడు చనిపోయాక కూడా చాలా మంది రాణులు విధవలు గా జీవించే ఉండడమన్నది కన్పిస్తుంది. దీన్ని బట్టి వారి మీద సతి చేయాల్సిందిగా మరీ విపరీతమైన ఒత్తిడేమీ ఉండేది కాదని చెప్పవచ్చు.

అయితే రాజు మరణించినప్పుడు సతి చేసుకునే స్త్రీల నుంచి ఆ రాజు కు చెందిన పవిత్ర గౌరవాన్ని పెంచేందుకు ఒక ఆచారం అనేదే ఉండడం గమనించదగింది. సతి చేసుకునే స్త్రీల సంఖ్య పెంచడం కోసం చాలా మంది స్త్రీలని రాజు పడక కి పిలవడం, వారికి ప్రత్యేకహోదా

వివాహం చేసేవారు. వీరు సాధారణంగా రాజపుత్రేతర కులాలవారు చాలా వరకు తక్కువ కులాలు/జాతుల కు చెందినవారు. ఈ విధంగా సతీ సహగమన భార్యలుగా మార్చబడ్డవారిని ఆంగ్లంలో 'Common law wives' అన్నారు. ఉదా. : మహారాజా అజిత్ సింగ్ (జోధపూర్) 1698 లో చనిపోయినప్పుడు 2 రాణులతో పాటు 9 మంది Common law wives ఏడుగురు నెచ్చెలులు (సహేలీలు) సతీ చేశారు.

ముస్లిం మహిళలు విడాకుల్ని అంతగా అంగీకరించేవారు కాదు (మనకు కొన్ని విడాకుల & సాక్ష్యాలు లభిస్తున్నాయి).

ఆస్తి విషయంలో escheat ఉన్నప్పటికీ తండ్రి ఆస్తిని అతని మత ప్రకారంగా పిల్లలు వారసుల మధ్య పంచుకొంటారు. మహిళల వివాహాల & ఆస్తిలో వాటా గురించి ఎక్కడా పేర్కొనబడలేదు. కాని అలాంటి హక్కులు ఇతర ముస్లిం లేదా నాటి కోర్టుల ద్వారా అమలు చేయబడి ఉండొచ్చు.

సౌందర్య దిగువస్థాయి మహిళల జీవితం
క్లిష్టంగా దుర్భరంగా ఉండేది. నాటి చిత్రపటాల్లో
భవన నిర్మాణ శాస్త్రగ్రంథాల్లో స్త్రీలు పనిచేయడం
కన్పిస్తుంది – పసిబిడ్డలతో సహా! పురుషుల
కనీస వేతనాలు కన్నా స్త్రీల వేతనాలు తక్కువ.
అధికారిక లెక్కల ప్రకారం కోటా ప్రాంతంలో
పొలాల్లో పనిచేసే స్త్రీలు పురుషుల కన్నా తక్కువ
వేతనాలు పొందేవారు. స్త్రీలు ఇళ్ళ వృత్తుల్లో
వైశిష్ట్యం ప్రత్యేకంగా సాధించారు. నేత నేయడం
సాంప్రదాయికంగా నాడు అన్ని తరగతుల స్త్రీల చేతా
విస్తృతంగా చేయబడేది. బెంగాలు లో
ధాకా మస్లిన్ తయారు చేసే నాణ్యమైన దారం
స్త్రీల చేత తయారు చేయబడేది – ఈ స్త్రీలు
గా ఉన్నత కులాల కు చెందినవారు. వారి
సూక్ష్మమైన కంటిచూపు నైపుణ్యం గల చేతివేళ్ళు
ఉండేవి. ఈ స్త్రీలు నైపుణ్యం గల పనివారి
కొలువు అంటే నెలకు రూ. 3 వరకూ
పొందేవారు. అవధ ప్రత్యేకంగా పేర్కొంటారు

చివరన వర్షి కూడా స్త్రీల ప్రత్యేకతయే!
అయితే ఇలాంటి స్త్రీలందరూ వర్తకుడు లేదా
మాస్టర్ వ్యక్తిత్వాలకు తగిన నియంత్రణ లో
పనిచేసేవారన్నది స్పష్టమైన విషయం.

## Craft Production (16, 17 శతాబ్దాలలో) 7

చాలా వృత్తులకు కలప ఆధారంగా ఉండేది. కలపతో చేయబడ్డ భాగాల రవాణా సాధనాలుగా పల్లకీలు(1), ఎద్దుబండ్లు చెప్పవచ్చు. కేవలం చాలా శైలుల్లో చేసేవారు, ధనికుల కోసం చేసేవి బాగా అలంకరించబడి ఉండేవి.

భారత్ కి విశాల తీరరేఖ ఉన్నందున, ఉ.భా. చాలా నదులతో నిండబడినందున భారత్ కి పెద్ద సంఖ్యలో పడవలు(2), ఓడలు అవసరమయ్యేవి. విహారాలకై చిన్న చిన్న పడవల నుంచి విదేశీ వర్తకానికి పెద్ద పెద్ద ఓడల వరకూ అన్ని సైజుల్లో పడవలు తయారు చేసేవారు.

అరేబియా, బంగాళా ఖాతం లలో ఉన్న ఓడరేవులు - ధట్టా, సూరత్, బస్సేన్, గోవా, ట్రాంక్యూబార్, కొచ్చిన్, మచిలీపట్నం ప్రక్కనే ఉన్న నరసాపూర్, బాలాసోర్ పూర్, సత్ గావ్, చిట్టగాంగ్ ముఖ్యమైన నౌకా నిర్మాణ కేంద్రాలు. యూరోపియన్లు వారి కార్యక్రమాల్ని విస్తరం చేసినపుడు వారు వారి నౌకల్ని ఇక్కడ తయారు చేయించుకునేవారు. భారతీయుల నౌకలు యూరప్ వాటి కి బాగా

తగినట్టుగాని వారు గమనించారు, ~~అందువల్ల~~ వారు భారతీయులు నిర్మించిన నగల్ని కొనేవారు. 17 వ శ. ~~అంతా~~ 18 వ శ. ల చివర్లో ఇలా యూరోపియన్ డిమాండు పెరగడం వల్ల భారతీయ స్వర్ణకారుల పరిశ్రమ గణనీయంగా ~~ఊపు~~ అందుకుంది.

కలప లో కిటికీలు, తలుపులు, అనేక స్తంభ సౌందర్య(3) మంచాలు, పెట్టెలు మొదలైన తయారయ్యేవి. ధనికులు అధిక నాణ్యత గల కలప వాడేవారు.

ప్రతి ప్రాంతం దాని ప్రత్యేకతను సంతరించుకున్న వృత్తి తేడా కళ కలిగి ఉండేది. సూక్ష్మమైన గొప్ప చిత్రం మనం పరిశీలించవచ్చు.

ఇళ్ళు, భవనాలు, కోటలు, దేవాలయాల రాళ్ళని నిలువుగా వాడేవారు కాబట్టి రాళ్ళని చెక్కడం(4) ముఖ్య కళగా ఉండేది. భారతీయ రాతి పనివారు వారి నైపుణ్యానికి బాగా పేరొందినారు.

చెప్పులు, పుస్తకాల కవర్లు మొదలైన వాటికి తోలు(5) నైపుణ్యం దోహదపడుతూ ఉంది.

మొగలుల కాలంలో అహ్మదాబాదు, దౌలతాబాదు, లాహోర్, సియాల్‌కోట్, పాట్నా సమీపాన గల బిహార్‌షరీఫ్ మొ॥ అనేక కేంద్రాల్లో పేపరు (6) తయారు చేయబడేది. అహ్మదాబాదు పేపరు చాలా రకాల్లో ఉండేది ... ఇది అక్బరియా, ఖర్జీ, పశ్మియా లని పిలువబడి అమ్మేది. కాశ్మీరు పేపరు కూడా బాగా ప్రసిద్ధి పొందింది.

ఉ.భా. లో చాలా చోట్ల తయారైన పేపర్ని స్థానిక అవసరాలకే వాడేవారు. దక్షిణ భారతం లో పేపరు తయారీ పరిమితమైంది. చాలా వరకు పేపరు చేతితో తయారయ్యేది, coarse రకానికి చెందిందే.

పంట & ధాన్యం + నీళ్ల నిల్వ & మట్టి పాత్రల్ని వాడేవారు సమకాలీన సాహిత్యం... చాలా ఇళ్ల మట్టి టైల్స్ పైకప్పుల (పెంకుల) కలిగి ఉండేవి. మృణ్మయ సామాగ్రి (7) & గిరాకీ బాగా ఉండి ఉంటుంది. నిత్యావసరాలకు మృణ్మయపాత్రల & వస్తువుల తయారీ దేశమంతటా విరివిగా సాగేది.

పైన చెప్పిన coarse మృణ్మయాలే గాక ఉత్తమ crockery (8) కూడా తయారయ్యేది.

# Banking, Insurance and Credit systems

## హుండీ బిల్స్ ఆఫ్ ఎక్స్ఛేంజ్ (Bills of Exchange)

మొఘలుల యుగం లో 'హుండీలు' ద్రవ్య లావాదేవీలకు ఒక ముఖ్య సాధనం అయ్యాయి. ఒక నిర్దిష్ట స్థానానికి ధనం తీసుకెళ్లాల్సిన వర్తకుడు ఆ ధనాన్ని ఒక 'సర్రాఫ్' వద్ద డిపాజిట్ చేస్తాడు. ఆ సర్రాఫ్ ఆ వర్తకుడికి 'హుండీ' ఇష్యూ చేస్తాడు. వర్తకుడు ఈ హుండీ ని తన గమ్య స్థానం లో సర్రాఫ్ ఏజెంటు కి సమర్పించి దాన్ని ధనరూపం లోకి మార్చుకోవచ్చు. ధన రవాణా/ ధన బదలాయింపు కి ఇది భద్రత గల అనువైన పద్ధతి గా మారింది. కాలక్రమం లో హుండీ దానంతటదే ఒక లావాదేవీ సాధనమయ్యింది. హుండీని ఒక లావాదేవి కోసం సమర్పించవచ్చు. ఎండార్స్‌మెంట్ తర్వాత హుండీని మార్కెట్లో స్వేచ్ఛ గా కొనుక్కోవచ్చు & అమ్మవచ్చు.

ఇర్ఫాన్ హబీబ్ ప్రకారం 'హుండీ' నెగోషియబిలిటీ (negotiability) క్రమంగా పెద్ద సంఖ్యలో హుండీలు కేవలం చేతుల

